# Are you a fan of Garuda, the masked hero with magical powers?

*Enjoy the exciting exploits of Garuda!*




Don't miss the Garuda comics in Chandamama anymore!
Subscribe to Chandamama today!

**Chandamama Annual Subscription within India Rs. 120/-**
**Send your remittances by DD or MO favouring CHANDAMAMA INDIA LIMITED, to**
**No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097.**
**E-mail : subscription@chandamama.org**

# చందమామ

సంపుటి 104 జూన్ 2001 సంచిక 6



## ఈ సంచికలో...

కథలు
గంధర్వకన్య వరం (బే.క) పేజినం.09
తెలివి పెరిగింది! పేజినం.26
స్నేహధర్మం పేజినం.27
మూడుముక్కల మంత్రం పేజినం.39
స్థితప్రజ్ఞుడు పేజినం.42
వీరాగ్రేసరుడు పేజినం.58
స్వర్గమా? నరకమా? పేజినం.62
మొహమాటపు అల్లుడు పేజినం.65
జానపద సీరియల్
యక్షపర్వతం - 6 పేజినం. 15
పౌరాణిక సీరియల్
మహాభారతం-65 పేజినం.47
ప్రత్యేక శీర్షిక
పర్యావరణ దినోత్సవ ప్రత్యేకం! పేజినం.31
చిత్రకథ
అజేయుడు గరుడుడు-5 పేజినం.54
శీర్షికలు
ఈ నెలలో జన్మించిన ప్రముఖులు పేజినం.07
భారత సంస్కృతి-చరిత్ర-17 పేజినం.22
వార్తలు-విశేషాలు పేజినం.63
ఫోటో వ్యాఖ్యల పోటీ పేజినం.66

### ఈ నెల విశేషాలు

గంధర్వకన్య వరం! (బేతాళ కథ)





భారత సంస్కృతి - చరిత్ర

స్థితప్రజ్ఞుడు



యక్షపర్వతం



Printed and Published by B. Viswanatha Reddi at B.N.K Press Pvt. Ltd., Chennai-600 026 on behalf of Chandamama India Limited, No.82, Defence Officers Colony, Ekattuthangal, Chennai - 600 097. Editor: Viswam

సంపాదకుడు

విశ్వం



ఈ పత్రికలో ప్రకటనల కోసం సంప్రదించండి:

<u>చెన్నయ్</u>
అభిరామి స్వామి
ఫోన్ : 044-234 7384, 234 7399

<u>బెంగుళూరు</u>
సుధీర్ సలారియా
ఫోన్:080-559 8859/555 0821/524 5265

<u>కోల్‌కతా</u>
ఆషిష్ లాహా
ఫోన్ : 033-234 9529

<u>ఢిల్లీ</u>
మోనా భాటియా
ఫోన్:011-651 5111/656 5513/656 5516

<u>ముంబాయి</u>
షకీల్ ముల్లా
ఫోన్ : 022-266 1599/266 1946/265 3057

ఉత్తర ప్రత్యుత్తరాలకు:
చందమామ మేగజైన్ డివిజన్
82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ,
ఈక్కాట్టుతాంగల్,
చెన్నయ్ - 600 097.
ఫోన్ : 234 7384, 234 7399
ఫ్యాక్స్ : 234 7384
e-mail : chandamama@chandamama.org



**For USA**
**Single copy $2**
**Annual subscription $20**
***Residents of USA and Canada can mail their remittances to :***
**INDIA ABROAD**
**43 West 24th Street**
**New York,**
**NY 10010**
**Tel: (212) 929-1727**
**Fax (212) 627-9503**
**E-mail:mail@indiaabroad.com**



సంచాలకులు

చక్రపాణి. బి.నాగిరెడ్డి

# అందరికీ ఆనందం!

గుజరాత్‌లో భయంకర భూకంపం వచ్చి వేలాది మందిని పొట్టన పెట్టుకున్నప్పుడు — మరణించినవారు ఏ కులానికి, ఏ మతానికి చెందినవారని చూడకుండా మానవజాతి సమస్తం కన్నీరు కార్చింది; చేయతగిన సాయం చేసింది. ప్రేమ, కరుణ మొదలైన మానవతావిలువలు మనిషిలో ఇంకా అడుగంటి పోలేదనడానికి ఇదొక నిలువెత్తు నిదర్శనం! అయితే ఇలాంటి కష్టాలు, కడగండ్లు సంభవించేప్పుడు పెల్లుబికే ఈ ఉన్నత విలువలు, తక్కిన సమయాలలో కనిపించకుండా పోవడానికి కారణం ఏమిటి? మనిషిలోని కరుడుగట్టిన స్వార్థం, అసూయ, ద్వేషం మొదలైన అవలక్షణాలే!

బాలబాలికలలో ఉన్నత విలువలను పెంపొందించడానికి ఆధునిక విద్యావిధానం దోహదం చేస్తున్నదా అంటే సరిగ్గా సమాధానం చెప్పలేము. ఎందుకంటే ఆధునిక విద్యావిధానంలో మెదడుకు మేత కల్పించడానికి చూపే శ్రద్ధ; మనసుకు పరిపక్వత కల్గించడానికి చూపడం లేదు. అభివృద్ధి చెందిన దేశాలలో ఇది కొట్టొచ్చినట్టు కనిపిస్తున్నది. ఏ విద్యకైనా సరే సత్ప్రవర్తన, క్రమశిక్షణ పునాదులు కావాలి. అవి లేకుండా ఎంత సాధించినప్పటికీ ఆటవిక న్యాయం రాజ్యమేలుతూ- మనిషి పాతరాతి యుగానికి చెందిన ప్రవృత్తితోనే ఉండిపోవలసివస్తుంది!

మన దేశంలో అప్పుడప్పుడు కొందరు బాలలు సాహస కృత్యాలు చేశారని వింటూ వుంటాం. ఇటీవల ఒక పన్నెండేళ్ళ అమ్మాయి సకాలంలో అధికారులను హెచ్చరించి, బ్యాంకు దోపిడీని అరికట్టి, అక్కడ వాచ్‌మేన్‌గా పనిచేసే తన తండ్రి ప్రాణాలు కాపాడింది. మాయమర్మాలు తెలియని అమాయక హృదయాలు చేసే సాహసకృత్యాలకు ఇదొక మచ్చుతునక!

మనం నివసించే పరిసరాలు, పర్యావరణ పరిశుభ్రంగా ఉంటేనే మనం ఆరోగ్యంగా, ఆనందంగా ఉండగలం. దీనిని గుర్తుచేయడానికే జూన్ నెలలో ప్రపంచ పర్యావరణ దినోత్సవం జరుపుకుంటున్నాం. రేపటి ప్రపంచం పిల్లలదే గనక, పరిశుభ్రత - పచ్చదనం వెల్లివిరిసే వాతావరణం సృష్టించడానికి పెద్దలతో పాటు పిల్లలు కూడా తమ వంతు కృషి చేయాలి. అప్పుడే అందరికీ ఆరోగ్యం - ఆనందం; శాంతీ-సౌఖ్యం సమకూరుతాయి!




# HERO LUNCH BOX OFFER




BUY ANY HERO KID'S CYCLE, GET A LUNCH BOX FREE


SALSA


LAMBADA


BOSS


ROBO COP


PIRANHA


TERMINATOR


ACTIVE


CADET DX


BUZZ Jr

OFFER ALSO AVAILABLE ON: LIMBO, SPARKY, LI'L ANGEL, KIDD DX, BANDIT, SHERIFF & REX PHANTOM

Cycles also available without this offer. Offer valid from 15-4-01 to 31-5-01.

HTA.5810.2001

## ఈ నెలలో జన్మించిన ప్రముఖులు

### పి.సి.మహలానొబిస్

జనాభా, ప్రజల ఆర్థిక, విద్యా స్థితిగతులు మొదలైన వాటి విషయాలను సేకరించి, లెక్కగట్టి, క్రోడీకరించి గణాంక వివరాలను తయారు చేయడానికి కొన్ని ఆధునిక విశ్లేషణా విధానాలు రూపొందించబడి ఉన్నాయి. వాటిలో 'మల్టీవేరియేట్ అనాలిసిస్' 'ఇంటర్ పెనట్రేటింగ్ నెట్‌వర్క్ ఆఫ్ శాంపుల్స్', 'ఫ్రాక్టల్ గ్రాఫికల్ అనాలిసిస్' మొదలైన విధానాలు ముఖ్యమైనవి. వాటిని రూపొందించిన భారతీయ మేధావి ప్రశాంత చంద్ర మహలానొబిస్.

ప్రపంచ గణాంకరంగంలో భారతదేశానికి సముచిత స్థానం కల్పించిన గణాంక శాస్త్రవేత్త పి.సి.మహలానొబిస్ 1893 జూన్ 29వ తేదీ జన్మించాడు. 1912లో కలకత్తా విశ్వవిద్యాలయం నుంచి బి.ఎస్.సి (ఆనర్స్), కేంబ్రిడ్జ్ విశ్వవిద్యాలయంనుంచి గణితశాస్త్రంలో ఎం.ఏ.డిగ్రీలు సాధించాడు. ఆయనకు ఉపాధ్యాయుడు డబ్ల్యు.హెచ్. మెకాలే అప్పుడే వెలువడిన బయోమెట్రికా, బయోమెట్రిక్ టేబుల్స్ సంకలనాలను అధ్యయనం చేయమని సలహా ఇచ్చాడు. దాని ద్వారా ఆయనకు గణాంక శాస్త్రంతో పరిచయం ఏర్పడింది. వాటిని చదవడంతో ఆ విషయం పట్ల ఆయనకు ఎంతో ఆసక్తి ఏర్పడింది.

1915లో ఆయన భారతదేశానికి తిరిగివచ్చి, కలకత్తా ప్రెసిడెన్సీ కళాశాలలో భౌతికశాస్త్ర ఉపన్యాసక వృత్తిని చేపట్టాడు. సమయం దొరికినప్పుడల్లా గణాంకాలను అధ్యయనం చేయసాగాడు.

1917లో కలకత్తా విశ్వవిద్యాలయం పరీక్షా విధానంలో మార్పులు తీసుకురావాలని నిర్ణయించి, మహలానొబిస్ సహాయం కోరింది. తన గణాంక పరిజ్ఞానాన్ని ఉపయోగించి మహలానొబిస్-విద్యార్థులనూ, ఉపాధ్యాయులనూ పరీక్ష పత్రాలనూ, అధ్యయనం చేసి కొన్ని సూచనలు చేశాడు. వాటిని ప్రభుత్వం అమలు చేసింది.

అప్పటినుంచి ప్రభుత్వం మానవశాస్త్రం (ఆంత్రోపాలజీ) ఎపిడెమియోలజీ, డెమొగ్రఫీ, వాతావరణం మొదలైన విషయాలను గురించి కూడా మహలానొబిస్‌ను సంప్రదించడం మొదలు పెట్టింది.

1950లో ప్లానింగ్ కమిషన్ ఏర్పాటయినప్పుడు మహలానొబిస్ దాని ఉపాధ్యక్షుడుగా నియమించబడ్డాడు. భారత ప్రధాని అధ్యక్షుడుగా ఉండేవాడు.

భూమిమీద రెండు భౌగోళిక ప్రాంతాల మధ్య దూరాన్ని కొలవడానికి ఆయన ఒక ప్రత్యేక



విధానాన్ని కనుగొన్నాడు. అది 'మహలానొబిస్ డిస్టన్స్' గా పేరుగాంచింది.

1949లో ఆయన భారతజాతీయ ఆదాయ కమిటీ అధ్యక్షుడయ్యాడు. ఆ విధంగా 'నేషనల్ శాంపుల్ సర్వే' జరపడానికి కారకుడయ్యాడు. 1945లో ఆయన 'రాయల్‌సొసైటీ' సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు. ప్రొఫెసర్ మహలానొబిస్ విజ్ఞాన శాస్త్రానికి చేసిన సేవలకు గుర్తింపుగా 1968లో భారత ప్రభుత్వం ఆయన్ను 'పద్మవిభూషణ్' అవార్డుతో సత్కరించింది. 1972 జూన్ 28వ తేదీ ఆయన కీర్తిశేషుడయ్యాడు.

# పాఠకుల లేఖలు

ఇటీవలి చందమామలు చూసి 'కథల సంఖ్య బొత్తిగా తగ్గించేశా' రంటూ ప్రజలు గోల పెట్టేస్తున్నారు. చందమామ మునుపటిలా ఏడెనిమిది కథలతో దర్శనం ఇస్తుందని ఆశిస్తున్నాను. —మాచిరాజు కామేశ్వరరావు, విజయవాడ

ఈ మధ్య చందమామలో కథల సంఖ్య బాగా తగ్గిపోయింది. అలనాటి చందమామ ఒరవడికి భిన్నంగా ఈనాడు వెలువడుతున్న చందమామ వెలవెలపోతోంది. చక్కని కథలకు ప్రాధాన్యం కల్పించండి. చందమామ తన పూర్వవైభవాన్ని కలకాలం నిలుపుకోవాలని ఆశిస్తూ,

—వక్కలంక రామారావు, అమలాపురం-533201

నాకు చందమామ అంటే ఎనలేని ఇష్టం. చందమామ మరలా ప్రచురించాక, ఎంతో కొత్తదనం సంతరించుకున్నది. అంశాలన్నీ బాగా నచ్చాయి.

—ఎస్.పంచాక్షరి, నందిగామ -521185

మా అభిమాన చందమామ తిరిగి వస్తూండటం చాలా ఆనందదాయకం. కానీ కథల విషయంలో చాలా నిరుత్సాహం కలిగిస్తున్నారు. ఏప్రిల్‌లో కేవలం మూడు కథలు వేశారు. పూర్వం అన్ని వర్గాల వారినీ, అంటే పిల్లలనే కాక పెద్దలనూ, ముసలివారినీ, అందరినీ అలరించిన చందమామ ఇప్పుడు కొంచెం నిరుత్సాహం కలిగిస్తోంది (పెద్దలకు). పూర్వంలాగా కథలు పెంచితే బావుంటుంది. చందమామను కేవలం పిల్లలే చదవరని మీకూ తెలుసు. -శిల్ప, కాకినాడ

నేను చందమామను 25సం॥ నుంచి చదువుచున్నాను. ఇటీవల చారిత్రక విశేషాలు, శీర్షికలు మితిమించి వేస్తున్నారు. అవి తక్కువ చేసి కథలు వేస్తే మంచిది. సీరియల్ యక్ష పర్వతం, చిత్రకథ అజేయుడు గరుడుడు చాలా బాగున్నాయి.

— పి.రాజన్‌బాబు, ఘట్‌కేసర్-501301

నవ సహస్రాబ్ది ఆరంభాన్ని పురస్కరించుకుని 'ప్రత్యేక శీర్షిక' ద్వారా మనదేశంలో గత శతాబ్దంలో జరిగిన ముఖ్య సంఘటనలను తెలియజేయడానికి ప్రయత్నించాము. చందమామలో ఎప్పటిలాగే చక్కని కథలకు ప్రాధాన్యతనిస్తూ, పత్రికను ప్రత్యేక ఒరవడిలో తీసుకురాగలము. పాఠకులైన మీ అభిప్రాయాలను గౌరవిస్తూ, చందమామ పట్ల మీరు చూపుతూన్న అపూర్వ ఆదరాభిమానాలకు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాము. —సంపాదకుడు




బేతాళ కథలు

# గంధర్వకన్య వరం!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఇంత అర్ధరాత్రి వేళ కన్ను పొడుచుకున్నా కానరాని కటిక చీకటిలో విషసర్పాలూ, శాకినీ, ఢాకినీలాంటి భయంకర భూతాలూ విచ్చలవిడిగా తిరుగాడే, ఈ శ్మశానంలో నువ్వు పడుతున్న ఇక్కట్లు చూస్తూంటే, ప్రబోధుడనే చిత్రకారుడి లాగా, ఏమైనా మనోవైకల్యానికి గురి అయ్యావేమో అన్న శంక బాధిస్తున్నది. ఇతరులకు హాని కలిగించనిదీ, తనకు మేలు చేసేదీ అయినదేదీ



స్వార్థం అనిపించుకోదు.ఈ సత్యాన్ని గుర్తించలేక, తుదిక్షణం వరకూ ఇక్కట్లపాలైన, ఆ చిత్రకారుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా,విను,''అంటూఇలాచెప్పసాగాడు:

వైశాలినీ రాజ్యంలో, ప్రబోధుడనే చిత్రకారుడుండేవాడు. అతడికి చిత్రకళలో అద్భుతమైన నైపుణ్యం వున్నది. అతడి చిత్రాలు అందంగా, సజీవంగా వుండేవి. అయితే, దురదృష్టవశాత్తు ప్రబోధుడి చిత్రాలకు జనబాహుళ్యంలో అంతగా ఆదరణ లభించలేదు. అతడికి పూట గడవటమే కష్టమైంది.

అయితే, ప్రబోధుడికి చిత్రకళ వదిలి, బతుకుతెరువుకు మరేదైనా వృత్తిలో ప్రవేశించడం ఇష్టంలేదు. కానీ తనను నమ్ముకున్న భార్యాబిడ్డల పరిస్థితి చూసి, అతడు చాలా ఆందోళన చెందాడు. చివరకు ఎంతగానో ఆలోచించి— తన ప్రతిభనంతా రంగరించి ఒక చిత్రం గీసి, దాన్ని తండ్రి మరణించిన కారణంగా, త్వరలోనే రాజ్యాభిషిక్తుడు కానున్న యువరాజుకు చూపించాలనుకున్నాడు.

ఆ తర్వాత కొద్ది రోజులకు అతడు చిత్రకళలో తనకున్న ప్రతిభనంతా మేళవించి, ఒక అద్భుత సౌందర్యరాశిని చిత్రీకరించాడు. ఆ చిత్రంతో ప్రబోధుడు రాజధాని చేరి, యువరాజు దర్శనానికి ఎంతగానో ప్రయత్నించాడు; కాని ప్రయోజనం లేకపోయింది. దురదృష్టం తనను వెంటాడడం మాననందుకు అతడు చాలా చింతించాడు.

ప్రబోధుడు ఆ రాత్రి ఒక సత్రంలో బస చేశాడు. ఆ సత్రంలోవున్న ఇతర బాటసారులు అతడి చిత్రం చూసి అద్భుతం అంటూ ప్రశంసించారు. ఆ ప్రశంసలు అతడి బాధను మరింతగా పెంచాయి.

ఆ రాత్రి ఒక బాటసారి సత్రానికి ఆలస్యంగా వచ్చాడు. అతడు యువకుడు. అందంగా, దృఢంగా వున్నాడు. అతడు సత్రంలో అందరూ ప్రబోధుడి చిత్రపటం గురించి మాట్లాడుకోవడం విని, తనూ ఆ చిత్రపటం చూడాలనుకున్నాడు. ప్రబోధుడు, అతడికి తను చిత్రించిన చిత్రపటం చూపించాడు.

చిత్రపటంలోని స్త్రీమూర్తి అద్భుత సౌందర్యానికి ముగ్ధుడైన ఆ యువకుడు,ప్రబోధుడికి రాజదర్శనం లభించని వైనం తెలుసుకుని, ''నీ చిత్రకళానైపుణ్యం నిజంగా ప్రశంసనీయం. నా వెంట వస్తే, రాజదర్శనం కలిగేలా చేయగలను,'' అన్నాడు.

ప్రబోధుడు సంతోషంగా అతడి వెంట నగరంచేరి, రాజభవనంలోకి వెళ్ళాడు. యువకుడు, అతణ్ణి ఒక మందిరంలో కూర్చోబెట్టి, లోపలికి వెళ్ళి దుస్తులు మార్చుకుని వచ్చాడు. రాజలాంఛనాలతో వున్న అతణ్ణిచూస్తూనే యువరాజు అభిషిక్తుడని గ్రహించి, ప్రబోధుడు నమస్కరించి, ''క్షమించండి, యువరాజా! సత్రంలో కలిసినప్పుడు మిమ్మల్ని గుర్తించలేకపోయాను,'' అన్నాడు.

అభిషిక్తుడు చిన్నగా నవ్వి,''ఎవ్వరూ గుర్తించకూడదనే,సామాన్య దుస్తులలో రాజ్య పరిస్థితి ఎలావున్నదీ తెలుసుకునేందుకు తిరుగుతూంటాను. సరే! నీ చిత్రంలోని సుందరి అందం నన్నెంతగానో ఆకట్టుకున్నది. ఆమెనే వివాహమాడాలని నిశ్చయించుకున్నాను. ఆ యువతి వివరాలు చెబితే నీకు పదివేల వరహాలు బహుమతిగా ఇస్తాను,''అన్నాడు.

''యువరాజా! నేను చిత్రించిన యువతి సజీవ సుందరికాదు; కేవలం ఊహాసుందరి మాత్రమే!''అన్నాడు ప్రబోధుడు.

ఆ మాటలకు అభిషిక్తుడు, ''ప్రబోధా! నాకూ చిత్రకళలో అంతో ఇంతో ప్రవేశమున్నది. ఏదైనా చిత్రం చూసిన వెంటనే,అది సజీవ దృశ్యచిత్రణా లేక ఊహచిత్రణా అన్నది చెప్పగలను. ఆమె వివరాలు నువ్వు నాకు చెప్పినట్టు రహస్యంగా వుంచుతాను. నిజం చెప్పు!''అన్నాడు.

అభిషిక్తుడి మాటలకు ప్రబోధుడు కలవరపడుతూ, ''నేను చెప్పేది సత్యం. నా చిత్రం కేవలం ఊహాచిత్రం,''అన్నాడు.



ఆ జవాబుకు కోపగించిన అభిషిక్తుడు, భటులను పిలిచి, ''ఈ మూర్ఖుణ్ణి కొండపైకి తీసుకుపోయి తల నరికి లోయలో పారేయండి!''అని ఆజ్ఞాపించాడు.

భటులు, ప్రబోధుడి పెడరెక్కలు విరిచి కట్టి కొండ పైకివెళ్ళారు. అతడు తన దుస్థితికి చింతిస్తూ, ''చిత్రకళను నమ్ముకుని ప్రాణం మీదికి తెచ్చుకున్నాను. నా భార్యాబిడ్డలు దిక్కులేని వారవుతారు,''అని దుఃఖించాడు.

రాజభటులు,ప్రబోధుడి శిరస్సు ఖండించబోతూండగా, అక్కడ ఒక స్త్రీ ప్రత్యక్షమయి, రాజభటులను వారించి, ''ఎందుకితణ్ణి చంపుతున్నారు?''అని అడిగింది.

''రాజాజ్ఞ!'' అని బదులు పలికారు రాజభటులు.

అంతలో ప్రబోధుడు,ఆ స్త్రీనిచూసిఆశ్చర్యపోతూ, ''నీ వల్లనే నాకీశిక్ష!'' అన్నాడు.



అందుకా స్త్రీ ఆశ్చర్యంగా, "నా పేరు మణిమాలిక. నేనొక గంధర్వకన్యను. నేను తలచుకుంటే తప్ప మనుషులకు కనిపించను. ఇంతవరకూ నువ్వు నన్ను చూసింది లేదు. మరి నీ శిక్షకు నేనెలా కారణమయ్యాను?" అని ప్రశ్నించింది.

అప్పుడు ప్రబోధుడు జరిగిందంతా వివరంగా చెప్పాడు. మణిమాలిక అంతా విని, "చాలా చిత్రంగావుంది.నన్ను చూడకుండా, నా రూపం ఎలా చిత్రించగలవు? నీ మాట నమ్మదగినదిగాలేదు,"అన్నది.

"నేవేసిన చిత్రం చూస్తే, నేను అబద్ధం ఆడడంలేదని ఒప్పుకుంటావు," అన్నాడు ప్రబోధుడు.

"సరే! నీ చిత్ర సుందరి నన్ను పోలివుంటే, నువ్వు కోరిన వరం ఇస్తాను,"అన్నది మణిమాలిక.

మణిమాలిక, ప్రబోధుడితో రాజభవనానికి బయల్దేరుతూంటే, భటులంతా వాళ్ళను అడ్డగించి, "రాజాజ్ఞ ప్రకారం, ఇతడి తల తీయాలి, అడ్డురాకు!" అన్నారు.

అది వింటూనే మణిమాలిక, భటులపై కోపగించి, "నరాధముల్లారా! నా శక్తి తెలియక అడ్డుకుంటున్నారు. బండరాళ్ళయి పోండి!" అని శపించింది.

మరుక్షణం రాజభటులు బండరాళ్ళుగా మారిపోయారు.

మణిమాలిక, ప్రబోధుణ్ణి వెంటబెట్టుకుని, తన అదృశ్య గమనశక్తితో క్షణంలో రాజమందిరం చేరింది.

ముందుగా ప్రబోధుణ్ణి చూసిన యువరాజు అభిషిక్తుడు, "ఎలా తప్పించుకు రాగలిగావు?"అని ఆగ్రహించాడు.అయితే, మరుక్షణం అతడి వెనకవున్న మణిమాలికను చూసి సంతోషపడుతూ, "ఈమే గదా, నీ చిత్రసుందరి! ఆహా, నా ఊహ నిజమైంది. నీ చిత్రం సజీవమూర్తిదే. ఇప్పటికైనా ఈమెను నా సమక్షానికి తెచ్చి మంచిపని చేశావు. ఈ పని ముందే చేసి వుంటే ప్రాణాల మీదికి వచ్చేది కాదుగదా!"అన్నాడు.

అప్పుడు మణిమాలిక, "రాకుమారా! ఒకసారి ఆ చిత్రపటం ఏదో చూపించు," అన్నది.

అభిషిక్తుడు చిత్రపటం తెచ్చి ఆమెకు చూపించాడు. ఆ పటం చూసిన మణిమాలిక, అందులోని స్త్రీమూర్తి పూర్తిగా తన పోలికలతో వుండడం గమనించి అబ్బురపడుతూ, "రాకుమారా! ఇది నిజంగా ప్రబోధుడిఊహాచిత్రమే.ఎందువల్లనంటే,గంధర్వ

కన్యనైన నన్ను ఇతడు ఇంతకు ముందె న్నడూ చూసి వుండలేదు,''అన్నది.

''గంధర్వ సుందరీ! ఏది ఏమైతేనేం, నువ్వు కంటబడడం అదృష్టం. దయతలచి నాతో వివాహానికి సమ్మతించు,''అని కోరాడు అభిషిక్తుడు. అందుకు మణిమాలిక, ''నేను నీ కోరిక నెరవేర్చలేను.అయితే, ప్రబోధుడి కిచ్చిన మాట ప్రకారం అతడికి వరం ఇచ్చి వెళ తాను,'' అన్నది.

ఆ వరం సంగతి అప్పుడే విన్న అభిషిక్తుడు, ప్రబోధుడితో, ''ప్రబోధా! మణిమాలికను, నన్ను వివాహమాడమని వరం కోరు. త్వరలోనే నాకు పట్టాభిషేకం జరుగనున్నది.నీవు కోరిన ప్రాంతాన నిన్ను సామంత రాజుగా చేస్తాను,'' అన్నాడు. మణిమాలిక ఒక క్షణకాలం ఆలోచించి, ప్రబోధుడితో, ''ప్రబోధా! నువ్వు కోరేది, రాకుమారుడు కోరమన్న వరమైనా మాట తప్పను. నీ మనసులోని కోరిక నిస్సం కోచంగా వెల్లడించు,''అన్నది.

ఆ వెంటనే ప్రబోధుడు చేతులు జోడించి, ''గంధర్వసుందరీ!నన్ను చంపబోయిన రాజ భటులను బండరాళ్ళుగా మార్చావు.దయ తలచి వాళ్ళకు నిజరూపాలు ప్రసాదించు, నిన్ను నేను కోరే వరం ఇదే!'' అన్నాడు.

''తథాస్తు!''అని మాయమైంది మణి మాలిక.అప్పుడు, ప్రబోధుడు, అభిషిక్తుడికి నమస్కరించి, ''యువరాజా! గంధర్వ కన్యను వివాహమాడాలన్న మీకోరిక నెరవేర్చ లేకపోయాను. మీరేశిక్ష విధించినా అనుభ విస్తాను,''అన్నాడు.



ఆ మాట వింటూనే అభిషిక్తుడు, ప్రబో ధుణ్ణి అప్యాయంగా కౌగలించుకుని, "నీ చిత్రకళానైపుణ్యం అనితరసాధ్యం. నువ్వు అపూర్వ చిత్రకారుడివి!" అంటూ ప్రశం సించి, ఎన్నో విలువైన కానుకలతో సాగ నంపాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ప్రబో ధుడు కుటుంబ పోషణభారం మోయలేక ఎన్నో బాధలకు గురయ్యాడు. చివరకు యువరాజు అభిషిక్తుడి చేత మరణ శిక్ష పొంది, గంధర్వకన్య మణిమాలిక సాయం వల్ల ప్రాణాలతో బయటపడ్డాడు. అలాంటి స్థితిలో,మణిమాలిక వరంకోరుకోమన్నప్పుడు, ఏ అష్టైశ్వర్యాలో కోరుకోక, బండరాళ్ళుగా పడివున్న రాజభటులకు తిరిగి నిజరూపా లివ్వమని కోరడం, అతడి మనోవైకల్యం కాక మరేమవుతుంది? అలాగే, గంధర్వ కన్యను వివాహమాడగోరిన అభిషిక్తుడికి, ప్రబోధుడి వరం ద్వారా అది సాధ్యమని తెలుసుగదా? అయినా ఆ వరాన్ని ప్రబోధుడు,రాజభటుల మేలుకు ఉపయోగించినప్పుడు, అతడిపై కోపగించక అతడి చిత్రకళను మెచ్చుకుని, విలువైన కానుకలతో సత్కరించడం మతి చాంచల్యంకాదా? ఈ సందేహాలకు సమా ధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "ప్రబోధుడు, అభిషిక్తుడిస్తానన్న సామంత పదవి మీద ఆశ పడక, మణిమాలికను, రాజభటులను రక్షించమని కోరాడు. అతడు తాను నేర్చిన కళలో రాణించి, కుటుంబపోషణ జరుపు కోవాలన్న ఆలోచనలోవున్న వాడేకాని, వరా లతో ఐశ్వర్యం గడించాలనే ప్రలోభం వున్న వాడు కాడు. అతడిది నిజమైన కళాకారుడి మనస్తత్వం; మనోవైకల్యం కాదు. ఇక అభి షిక్తుడి విషయానికొస్తే-మణిమాలిక,రాజాజ్ఞ నిర్వహించబోయిన భటులను, నరాధము లంటూ బండరాళ్ళుగా మార్చింది. ఇది తెలుసుకున్న అభిషిక్తుడికి, గంధర్వులకూ, మానవులకూ జాతి అంతరమే కాదు;శక్తిలో, ప్రవర్తనలోకూడా ఎంతో భిన్నత్వమున్నదని అర్థమైంది. ఆ కారణంగానే అతడు, ప్రబో ధుడిపై ఆగ్రహించక, ఘన సన్మానం చేసి పంపాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు —(కల్పితం)

[ఆధారం : ఎన్. శివనాగేశ్వరరావు రచన]





# యక్షపర్వతం

## 6

[కొండప్రాంతాన్ని చేరిన ఖడ్గజీవదత్తులకు, బందిపోటువాళ్ళ వెంటవున్న స్వర్ణాచారి కనిపించాడు. అతడితో కలిసి వాళ్ళు కొండపైకి పోయారు. ఆ సమయంలో ఒక బందిపోటువాడు, వాళ్ళదగ్గరకు పరిగెత్తుకుంటూ వచ్చి, వేటకు పోయిన తమ నాయకుడు సమరబాహుణ్ణి నరమాంస భక్షకులు పట్టుకున్నారని చెప్పి, అతణ్ణి కాపాడమని వేడుకున్నాడు. తరవాత-]

బందిపోటువాడుచెప్పినమాటలు వింటూంటే, ఖడ్గజీవదత్తులకు ఎక్కడలేని ఆశ్చర్యం కలిగింది. ఇన్ని రోజులుగా వాళ్ళు అరణ్యాల్లో ఎంతో దూరం ప్రయాణించారుగాని, ఎక్కడా వాళ్ళకు నరమాంస భక్షకులు తారస పడలేదు. జీవదత్తుడు బందిపోటువాడితో, "మీ నాయకుణ్ణి వాళ్ళు కాల్చుకు తింటారో లేక పచ్చి పచ్చిగానే తినేస్తారో, అదంతా తరవాత చూద్దాం.నువ్వు ముందు కాలయాపనచెయ్యకుండా జరిగిందేమిటో చెప్పు," అన్నాడు.

"అయ్యా, మేం అరణ్యంలోకి వేటకు పోయి, ఒక లేడిని చంపి భుజాన వేసుకుని ఇళ్ళకు తిరిగి వస్తున్నాం. దారిలో ఒకచోట పులి గాండ్రింపూ, ఒక మనిషి భయంతో కేక పెట్టిన ధ్వనీ వినిపించింది. మేం ముగ్గురం అటుకేసి వెళ్ళాం. ఒకచోట ఆదివాసుడొకడు పులికాళ్ళకింద చచ్చి పడివున్నాడు. పులి గుండెల్లోవాడు గుచ్చిన ఈటెవున్నది. సమీపంలో ఒకపులిపిల్ల గోలగా అరుస్తూ తిరుగుతున్నది," అన్నాడు బందిపోటువాడు.

"అది చచ్చినపులి పిల్ల అయివుంటుంది. సరే, తర్వాత ఏం జరిగింది?" అన్నాడు జీవదత్తుడు.

"మా నాయకుడు ఆ పులిపిల్లను తీసుకుపోయి పెంచుదాం అన్నాడు. నేను నక్కుతూ పోయిదాన్ని పట్టుకున్నాను. ఇంతలో పదీ



పన్నెండు మంది ఎలుగుబంటి చర్మాలు ధరించినవాళ్ళు,చెట్లచాటునుంచి హఠాత్తుగా వచ్చి మీద పడి మమ్మల్ని పట్టుకున్నారు. వాళ్ళ నాయకుడు ముఖం కనిపించకుండా, ఒక ఎలుగుబంటి తల తగిలించుకుని వున్నాడు. వాళ్ళు మా నాయకుడికీ, నాతోటి వాడికీ మాత్రం చేతులకు తాళ్ళు కట్టి, నన్ను పులిపిల్లతో తమ వెంట రమ్మన్నారు. నేను ధైర్యం తెచ్చుకుని పులిపిల్లను ఎలుగుబంటి తల పెట్టుకున్న వాడి భుజాల మీదికి విసిరి వేశాను. అది వాడి భుజాల మీద పడుతూనే, వాడి గొంతు పట్టుకున్నది. వాడు దానితో పెనుగులాడే సమయంలో నేను ఇటు పారి పోయి వచ్చాను,'' అన్నాడు.

ఇంతలో, ఒక ఎత్తయిన రాతి మీద నిలబడి అరణ్యంకేసి చూస్తున్న బందిపోటు వాడొకడు ఖడ్గజీవదత్తులతో, ''అయ్యా, మన కొండ కింది అరణ్యంలో చాలామంది ఆది వాసులు కొమ్ముబూరలూ, డప్పులూ వాయిస్తూ, ఎలుగుబంట్లతో నాట్యం చేయిస్తూ పోతున్నారు. వాళ్ళకు ముందు చేతులకు తాళ్ళు కట్టిన మా నాయకుడూ, మావాడు మరొకడూవున్నారు,''అని చెప్పాడు.

''అలాగా!'' అంటూ స్వర్ణాచారి కొండ దిగువకు చూసి, ఖడ్గజీవదత్తులతో, ''ప్రభువు ల్లారా! మీరెలాగైనా సమరబాహుణ్ణి రక్షిం చాలి,'' అని చేతులు జోడించాడు.

''సరే, స్వర్ణాచారీ! నువ్వంతగా కోరు తున్నావుగనక, మేము తప్పక అతణ్ణి రక్షించే ప్రయత్నం చేస్తాం,'' అన్నాడు జీవదత్తుడు.

ఆ తర్వాత ఖడ్గజీవదత్తులు కొండ దిగి అరణ్యంలో ప్రవేశించారు. వాళ్ళు కొంత దూరం వెళ్ళే సరికి, అప్పటివరకూ దూరంగా వినబడుతున్న డప్పులా, కొమ్ముబూరలా మోతలు హఠాత్తుగా ఆగిపోయినై.

ఒకటి రెండు క్షణాల తర్వాత, దాపుల నున్న చెట్ల వెనక నుంచి ఒకేసారి రెండు, మూడు తోడేళ్ళు అరిచిన శబ్దం వినిపిం చింది. ఆ అరుపులు వింటూనే జీవదత్తుడు, ''ఇదేదో వింతగా వుంది. పట్టపగలు మను షులు సంచరించే ఈ ప్రాంతాల తోడేళ్ళు కూయటమా!'' అంటూ, నేలబారుగావున్న చెట్లకొమ్మల చాటున నిలబడి ముందుకు చూశాడు.

ఒకచోట ఖడ్గజీవదత్తులకు చాలా విశాల మైన పంటపొలం ఒకటి కనిపించింది. అందులో కొంత భాగాన రకరకాల కూర గాయమొక్కలు ఏపుగా పెరిగివున్నవి. మిగి లిన ప్రదేశమంతా ఫలవృక్షాలతో కంటికి

ఇంపుగా కనబడుతున్నది. కూరపాదులకు నలుగురు అనాగరిక మనుషులు నీళ్ళు తెచ్చి పోస్తున్నారు. దగ్గరలోవున్న చెట్ల నీడలో ఇద్దరు ఎలుగుబంటి చర్మాలు ధరించిన వాళ్ళు, తోడేళ్ళతో కూర్చుని వున్నారు.

ఖడ్గజీవదత్తులు ఇప్పుడు ఏం చేయ టమా, అని ఆలోచించేంతలో, ఎలుగుబంటి వాడొకడు నీళ్ళు పోస్తున్న వాళ్ళ దగ్గరకు పోయి, "ఒరే, బానిసవెధవల్లారా! తొందరగా పని ముగించండి," అని హెచ్చరించి, ఒక చెట్టుబోదెకు ఆనుకుని కునికిపాట్లు పడ సాగాడు. రెండవవాడు తోడేళ్ళ తలలు నిము రుతూ నిద్రమత్తుతో ఊగ సాగాడు.

"ఆహా, గొప్ప కాపలాభటులు!" అంటూ ఖడ్గజీవదత్తులు కత్తి దూయబోయేంతలో, కూరపాదులకు నీళ్ళు పోస్తున్న బానిసలలో ఒకడు, పొదల వెనకగా నక్కి నడుస్తూ, చెట్టుబోదెకు ఆనుకుని కూర్చుని కునికి పాట్లుపడుతున్నవాడిని సమీపించసాగాడు.

బానిసవాడు ఏం చేయబోతున్నాడా అని ఖడ్గజీవదత్తులు ఆశ్చర్యపడేంతలో, వాడు నీళ్ళకుండలోంచి చప్పున ఒక రాయిని బయ టికి తీసి, దానితో కాపలావాడి తల మీద ఒక బాదు బాదాడు. దెబ్బతింటూనే కాపలావాడు ఒక చావుకేక పెట్టి బోర్లాపడి పోయాడు. బానిసవాడు అక్కణ్ణించి పరిగెత్త సాగాడు.

తన తోటి కాపలావాడు పెట్టిన చావుకేక వింటూనే రెండవ కాపలావాడు కళ్ళు తెరిచి, జరిగిందేమిటో గ్రహించి, తన పెంపుడు తోడే ళ్ళను ఉసిగొల్పాడు. అవి అరుస్తూ, పారి పోతున్న బానిసవాడి వెంట పడినై. వాటి వెనకగా కాపలావాడు పరిగెత్త సాగాడు.



"జీవా! పారిపోయిన బానిసవాడి వెంట పడిన తోడేళ్ళ అరుపులు ఇంకా వినబడు తున్నవి. పద, అరణ్యంలో మరికాస్త దూరం పోతే, సమరబాహుణ్ణి బంధించి తీసుకు పోతూన్న ఎలుగుబంటి ముఠా కనబడ వచ్చు," అన్నాడు ఖడ్గవర్మ.

వాళ్ళిద్దరూ తోడేళ్ళ అరుపులు వినిపి స్తూన్న వైపుకు బయలుదేరి కొంతదూరం వెళ్ళేసరికి, హఠాత్తుగా డప్పులూ, కొమ్ము బూరలూ ఒక్కసారిగా మోగిన ధ్వని విన బడింది. ఖడ్గజీవదత్తులు, ఆ ధ్వనులు వచ్చిన వైపుకు చూశారు. దూరంగా చెట్ల చాటు నుంచి నల్లని పొగ లేస్తున్నది.

"ఆ పొగకు, ఎలుగుబంటు ముఠా వాళ్ళు, సమరబాహుణ్ణి కాల్చుకు తినేందుకు వెలిగించిన మంట కారణం కాదు గదా!" అన్నాడు జీవదత్తుడు.



''అంతే కావచ్చు! త్వరగా అక్కడికి పోవటంమంచిది,'' అన్నాడు ఖడ్గవర్మ.

ఆ వెంటనే వాళ్ళిద్దరూ పొగలేస్తున్న ప్రదేశం కేసి, పరిగెత్త సాగారు. కొంతసేపటికి వాళ్ళు అక్కడికి చేరి, కొద్ది దూరంలోవున్న ఒక ఎత్తయిన చెట్టు ఎక్కి ఎలుగుబంటి ముఠా ఏమి చేస్తున్నదో చూడసాగారు.

పొగలేస్తున్న చోటుకు పక్కనే భూమిలోకి చొచ్చుకు పోయిన పెద్ద బిలం ఒకటున్నది. అక్కడ ఎలుగుబంటు వాళ్ళు, తాము అరణ్యంలో చంపి తెచ్చిన జంతువులను మంటల్లో వేసి కాల్చుతున్నారు. కొందరు డప్పులు వాయిస్తూ, ఎలుగుబంట్లతో ఆటలాడిస్తూ వినోదిస్తున్నారు.

''జీవా, ఈ అడవిజాతి వాళ్ళ నివాసస్థానం, ఆ కనబడే బిలంగా వున్నది. బిలంలోకి దిగే మెట్లు కనిపిస్తున్నవిగదా! ఏదీ, వీళ్ళు బందిపోటు సమరబాహును కాల్చుకుతింటున్న సూచనలేవీ కనిపించడంలేదే!'' అన్నాడు ఖడ్గవర్మ నవ్వుతూ.

ఖడ్గజీవదత్తులు ఇలా మాట్లాడుకుంటున్న సమయంలో, ఎలుగుబంట్లముఠా నాయకుడొకడు, కళ్ళకు గంతలు కట్టబడివున్న సమరబాహునూ, అతడి అనుచరుణ్ణీ తీసుకుపోయి, వాళ్ళ గురువు ముందు నిలబెట్టి, వంగి నమస్కరించి, ''గురుభల్లూకా! ఈ ఇద్దరూ మాకు అరణ్యంలో దొరికారు. చూడబోతే ఇద్దరూ నాకు పౌరుషవంతుల్లాగే కనిపిస్తున్నారు. మాకు ఒక పట్టాన లొంగలేదు,'' అని చెప్పాడు.

గురుభల్లూకుడు సభామంటపంలా వున్న, ఒక గుండ్రని సమతల ప్రదేశంలో ఎత్తుగావున్న ఒకరాతి ఆసనం మీద కూర్చుని వున్నాడు. అతడి ముఖం మాత్రం కనిపించకుండా, ఒక ఎలుగుబంటి తల తగిలించుకున్నాడు. ఆసనానికి రెండు పక్కలా రెండు భయంకరమైన తోడేళ్ళు నిలబడి, నోళ్ళు తెరిచి బందీలకేసి చూస్తున్నవి.

ఎలుగుబంటు ముఠా నాయకుడు చెప్పిన మాటలు విని, గురుభల్లూకుడు కొంచెంసేపు తలాడిస్తూ వూరుకుని, తరవాత సమరబాహుకేసి తల ఎత్తి చూస్తూ, ''ఒరే, నీ వేషం చూస్తూంటే, నువ్వేదో పట్నవాసం వాడిలావున్నావు. అసలు నువ్వీ అరణ్యంలో ఏం పని పడి వచ్చావు?'' అని అడిగాడు గద్దిస్తున్నట్టు.

ఆ వెంటనే సమరబాహు, ''నేను సింధు ఎడారుల నుంచి ఈ ప్రాంతానికి వచ్చాను. నాకు వందల సంఖ్యలో అనుచరులున్నారు.

వాళ్ళు నిన్నూ, నీ బిలగృహాన్నీ ధ్వంస ధూళి చేయగలరు!'' అన్నాడు భీకరమైన కంఠ స్వరంతో. ''ఒరే, నీ కంచుకంఠం, పౌరుష వాక్కులూ కూడా మెచ్చదగినవే!'' అంటూ గురుభల్లూకుడు పెద్దగా నవ్వి, ''నేనున్నది బిలగృహం కాదు; బిలదుర్గం! ఆ నువ్వనే నీ అనుచరులు నా బిలదుర్గాన్ని సమీపించే లోపలే, నా భల్లూకభటులు నీ వాళ్ళనందరినీ తోడేళ్ళ గుంపుకు ఆహారంగా వేస్తారు. నాతో బింకాలు పలకకు. నిన్నూ నీ వెంటవున్నవాణ్ణీ ఎలా లొంగదీసి, నా తతిమ్మా బానిసలతో పాటు పొలం పనులు చేయించాలో నాకు తెలుసు,'' అన్నాడు గురుభల్లూకుడు.

గురుభల్లూకుడు మాట ముగించేలోపలే, వాడి అనుచరులిద్దరు పరుగు పరుగున వచ్చి, సమరబాహుణ్ణి చూసి ఆగిపోయారు. గురు భల్లూకుడు వాళ్ళను, ''ఏమిటి సంగతి? ఎలాంటి రహస్య విషయాన్ని విన్నా, ఈ బందీలు మనకు చేయగలిగిన హానిలేదు. వీళ్ళను ఇప్పుడే తోడేళ్ళబండ దగ్గరకు పంపు తున్నాను,'' అన్నాడు.

''గురు భల్లూకా! ఇది చాలా ముఖ్యమైన సంగతి!'' అంటూ ఆ వచ్చిన వాళ్ళు గురు వును సమీపించి, రహస్యంగా ఏదో చెప్పారు.

ఆ మరుక్షణం గురుభల్లూకుడు, సమర బాహుని పట్టుకొచ్చిన ఎలుగుబంటు నాయ కుడి కేసి కోపంగా చూస్తూ, '' నీ తెలివి తేటలు ఇలా అఘోరిస్తున్నవన్న మాట!'' అని ఒక క్షణం ఆగి, ''సరే, ఈ బంధితు లిద్దర్నీ తోడేళ్ళబండ దగ్గర వదిలి రండి. ముందు వాళ్ళ చేతికట్లు విప్పి, చెరొక ఈటే ఇవ్వండి,'' అన్నాడు.




గురుభల్లూకుడి ఆజ్ఞ కాగానే, అతడి అనుచరులు సమరబాహుణ్ణీ, అతడి వెంట వున్నవాణ్ణీ అక్కడి నుంచి వెలుపలికి తీసుకు పోయారు.

వాళ్ళు అటువెళ్ళగానే గురుభల్లూకుడు తన అనుచరులతో, ''ఆ కొత్తవాళ్ళిద్దరూ మన బిలదుర్గ రహస్యం తెలుసుకునే వుంటారు. వాళ్ళను ప్రాణాలతో పట్టి తెండి,'' అని ఆజ్ఞా పించాడు.

''చిత్తం, గురుభల్లూకా!'' అని అతడి అనుచరులు పదీపన్నెండు మంది, సభా మంటపంనుంచి బిలంపైకి వున్న మెట్లకేసి వెళ్ళిపోయారు.

జీవదత్తుడు చెట్టు మీదినుంచి కిందికి దిగుతూ ఖడ్గవర్మతో, ''ఖడ్గా, మనం చూడ వలసినదంతా చూశాం. ఆకలి మండుతున్నది. ఇక్కడ ఏకొలనులోనైనా స్నానం చేసి, పళ్ళూ,



ఫలాలు తిని, చీకటి పడిన తరవాత బిలంలో ప్రవేశించే ఉపాయం ఆలోచిద్దాం,'' అన్నాడు.

ఖడ్గవర్మ మారు మాట్లాడకుండా జీవ దత్తుడితో పాటు చెట్టు దిగాడు. ఇద్దరూ త్వరలోనే ఒక పెద్ద కొలనును సమీపించారు. ఆ కొలను చుట్టూ గుబురు పొదలూ, ఎత్తయిన వృక్షాలూ ఉన్నవి. అరణ్య మృగాలు నీటికోసం వచ్చీపోయే దారులు కొన్ని ఖడ్గ జీవదత్తులకు కనిపించినై.

''ఖడ్గా, మనం త్వరగా స్నానాలు ముగించి ఇక్కణ్ణించి దూరంగా పోవడం క్షేమం. ఈ కొలనును అడవి జంతువులూ, ఎలుగు బంటుముఠావాళ్ళూ కూడా నీటి కోసం ఉప యోగించుకుంటున్నట్టున్నది,'' అన్నాడు జీవదత్తుడు.

జీవదత్తుడు ఇలా అంటూండగానే, దాపులనున్న పొదల్లోంచి నాలుగైదు అడవి కోళ్ళు గగ్గోలుగా అరుస్తూ బయటికి వచ్చినై. వాటిని చూస్తూనే ఖడ్గవర్మ, ''అడివికోడి మాంసం తిని చాలా రోజులైంది!'' అంటూ వాటి కేసి బాణం ఎక్కుపెట్టి వదిలాడు.

బాణం అడవికోళ్ళలో దేనికీ తగలలేదు. అవి అరుస్తూ ఎగిరిపోయినై. కాని, ఆ మరు క్షణానే, ''గురుభల్లూకా! చస్తిని, చస్తిని!'' అన్న మనిషికేక వినిపించింది.

ఆ కేక వింటూనే ఖడ్గజీవదత్తులు ఒక క్షణకాలం నివ్వెర పోయారు. తర్వాత వాళ్ళు చావుకేక వినబడ్డ పొదలను సమీపించేంతలో, అక్కడ ఎలుగుబంటి చర్మాలు ధరించిన వాడొకడు గిలగిల తన్నుకుంటూ కనిపించాడు.

జీవదత్తుడు, వాణ్ణి సమీపించి, ''ఒరే, బాబూ, నువ్వెవడివో తెలుస్తూనే వుంది. మేం నిన్ను చంపాలని బాణం కొట్టలేదు. ఈ పొదల్లో ఏం చేస్తున్నావు?'' అని అడిగాడు.

గాయపడినవాడు జవాబిచ్చే స్థితిలోలేడు. వాడు పొదల్లో అటూ ఇటూ పొర్లుతూ, ''గురుభల్లూకా! గురుభల్లూకా!'' అంటూ గొణగసాగాడు.

''జీవా, నా అనుమానం — వీడు అడివి కోళ్ళను పట్టుకునేందుకు పొదల్లో పొంచి వున్నాడా లేక మన మీద వేగు చేస్తున్నాడా అని?'' అన్నాడు ఖడ్గవర్మ.

''ఊహు, ప్రశ్నకు జవాబివ్వవలసినవాడి ఆత్మకాస్తా, గురుభల్లూకుడిలో ఐక్యం అయినట్టుంది!'' అంటూ జీవదత్తుడు వెనుదిరిగాడు.

ఆ తర్వాత ఇద్దరూ కొలనులో స్నానం చేసి, ఆ పక్కనే వున్న ఫలవృక్షాలనుంచి పళ్ళు

కోసుకు తిని, ఒకచెట్టు కిందసూర్యాస్తమయ కాలంవరకూ విశ్రాంతి తీసుకున్నారు.

సూర్యాస్తమయమైన కొంతసేపటికి అర ణ్యంఅంతా చీకట్లుకమ్మినై. ఖడ్గజీవదత్తులు, ఎలుగుగొడ్డు మనుషుల బిలం కేసి బయలు దేరి, కొద్దిసేపటికి బిలాన్ని సమీపించారు. బిలంపైన గాని, దిగువనున్న మెట్లవద్దగాని కాపలా వాళ్ళెవరూలేరు.

"ఖడ్గా, పరిస్థితి అర్థమైందిగదా! ఈ ఎలు గ్గొడ్డుగాళ్ళు మనను చాలా తెలివిగా బంధించ బోతున్నామని అనుకుంటున్నారు. మనం కావాలనే, సమరబాహు పరిస్థితి ఎలావుందో తెలుసుకునేందుకు వాళ్ళకు చిక్కబోతున్నా మని ఎరగరు, ఆహా!" అన్నాడు జీవదత్తుడు, బిలం లోపలికున్న మెట్లు దిగుతూ.

ఇద్దరూ కొన్ని మెట్లు దిగి కొంచెం చీకటిగా వున్న మలుపును చేరేంతలో, పదీపన్నెండు మంది ఎలుగ్గొడ్డు వాళ్ళు, చప్పున చీకట్లోంచి బయటికి వస్తూ, ఈటెలెత్తి, "ఆగండి! పారిపో జూశారో, మాఈటెలకు ఎరచేస్తాం," అన్నారు.

జీవదత్తుడు, వాళ్ళను చూసి నవ్వుతూ, "ఒరే, ఆ ఈటెలకు ఎరగా చేసేముందు, మీ గురుభల్లూకుడి దర్శనం ఇప్పించండి!" అన్నాడు.

ఎలుగ్గొడ్డు వాళ్ళల్లో ఒకడు చిన్న గొంతుతో, "అంత పెద్దగా మాట్లాడకు! గురుభల్లూ కుడు తన ఇష్టదేవత అయిన వృకేశ్వరి పూజలో ఉన్నాడు. మిమ్మల్మి ముందు తోడేళ్ళబండ దగ్గర ఉంచమన్నాడు. అక్కడి నుంచి బతికి రాగలిగితే గురుభల్లూకుడి దర్శనం తప్పక లభిస్తుంది," అన్నాడు.

"మహా ప్రసాదం! ఆ తోడేళ్ళ బండ ఎక్కడ?" అని అడిగాడు జీవదత్తుడు.

"తొందర పడకండి, అక్కడికే వెళు తున్నాం!" అంటూ ఎలుగ్గొడ్డువాళ్ళు, ఒక సొరంగంలోకి దారితీశారు. దూరాన ఎక్కడి నుంచో తోడేళ్ళ అరుపులూ, భీతిగొన్న మను షుల కేకలూ, ఆ సొరంగ మార్గంలో ప్రతి ధ్వనించసాగినై.

"ఖడ్గా, ఆ కేకలు సమరబాహూ అతడి అనుచరుడివై వుంటవి. తోడేళ్ళు వాళ్ళను చంపితినే ప్రయత్నం చేయటంలేదు గదా?" అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ ఏదో జవాబివ్వబోయేంతలో, ఎలుగు బంటువాళ్ళల్లో ఒకడు ఈటె ఝుళి పిస్తూ, "నిశ్శబ్దం! నిశ్శబ్దం! ఒకటి రెండు క్షణాల్లో, ఆ తోడేళ్ళు చేస్తున్నదేమిటో మీకళ్ళ తోనేచూస్తారు!" అన్నాడు. — (ఇంకావుంది)



# భారత సంస్కృతి - చరిత్ర

ఒక గొప్ప నాగరికతలోని ఘట్టాలు
తరతరాలుగా సత్యం కోసం జరిగిన అన్వేషణ!

## 17. శ్రీ జగన్నాథ రథయాత్ర!



ఆరోజు తన పుట్టినరోజు కావడంతో సందీపుడి మిత్రుడు ప్రసాద్, స్నేహితులందరికీ ఐస్‌క్రీములు పంచాడు. మిత్రుడికి పుట్టిన రోజు శుభాకాంక్షలు చెప్పాక, పిల్లలు అందరూ తాతయ్య నుంచి కథ వినడానికి సిద్ధమయ్యారు. శ్యామల దేవనాథుడి మెడ చుట్టూ చేయివేసి, ''తాతయ్యా! ఇవాళ ప్రసాద్ పుట్టిన రోజు గనక, ప్రత్యేకమైన కథ చెప్పాలి!'' అన్నది.

''అలాగే తల్లీ! ప్రసాద్ కోరిన కథ చెబుతాను, సరేనా!''అన్నాడు దేవనాథుడు.

శ్యామలతో పాటు మిత్రులందరూ సంతోషంతో చప్పట్లు చరిచారు. దేవనాథుడు ప్రసాద్ కేసి చూశాడు. ప్రసాద్, ''ఈ నెలాఖరున పూరీలో రథోత్సవాలు జరుగుతాయని ఈ రోజు ఉదయం పత్రికలో చదివాను. లక్షలాది భక్తులు పాల్గొనే ఈ రథోత్సవం వేలాది సంవత్సరాలుగా యేటా జరుగుతున్నదని రాశారు. దీనికి సంబంధించిన కథ ఉంటే చెప్పండి తాతయ్యా,'' అన్నాడు.

''ఉంది, బాబూ! అదొక ఆసక్తికరమైన వృత్తాంతం!'' అంటూ దేవనాథుడు ఇలా చెప్ప సాగాడు:

చాలా సంవత్సరాలకు పూర్వం కళింగ రాజ్యాన్ని ఇంద్రద్యుమ్నుడనే రాజు పరిపాలించేవాడు. ఆయన ఆదర్శపాలకుడు; శ్రీకృష్ణభక్తుడు. రాజు తన ఇష్టదైవానికి ఆలయం నిర్మించాలని సంకల్పించాడు. పనులు ప్రారంభించాడు. అయితే ఆలయంలో ప్రతిష్ఠించే విగ్రహానికి ఏదైనా ప్రత్యేకత ఉంటే బావుంటుందని తీవ్రంగా ఆలోచించ సాగాడు. ఒకనాటి రాత్రి ఆయనకు ఒక కల వచ్చింది. పూరీ సమీపంలో ఎక్కడో ఒకచోట

విశ్వావసు

దైవాంశతో నిండిన నిగూఢ వస్తువు ఉందని లీలగా తోచింది. ఆ వస్తువును తీసుకువచ్చి విగ్రహంలో నిక్షిప్తం చేసి ప్రతిష్ఠించినట్టయితే అది నిజంగానే ప్రత్యేకతను సంతరించుకుంటుందని దేవుడు ఆనతి ఇచ్చినట్టు కలగన్నాడు.

తెల్లవారాక విజ్ఞులైన ఆస్థాన పండితులను రప్పించి తన కల గురించి చెప్పాడు. ''మీరు నాలుగు దిక్కులకూ వెళ్ళి ఆ మహత్తర వస్తువును కనుగొని తీసుకురండి. మీ రాక కోసం నిరీక్షిస్తూ ఉంటాను. మీరు విజయవంతంగా తిరిగి వచ్చాకే, ఆలయంలో విగ్రహ ప్రతిష్ఠాపన,'' అన్నాడు.

అలా రాజు ఆనతి ప్రకారం బయలుదేరిన పండితులలో విద్యాపతి అనే బ్రాహ్మణ యువకుడు ఒకడు. ఆయన బయలుదేరే ముందు దైవప్రార్థన చేసి, తోచిన దిక్కుకేసి నడవసాగాడు. చాలాదూరం నడిచాక ఆయన ఒక అడవిని సమీపించాడు. అడవిలో నడిచి, నడిచి దారి తప్పాడు. సాయంకాలమయింది. ఇక నడవలేక అలసిపోయాడు. పెద్ద బండపై కూర్చోబోతూండగా జారి కిందబడి స్పృహ కోల్పోయాడు. అదృష్టవశాత్తు ఆ సమయానికి చెలికత్తెలతో అటుగా వచ్చిన బోయరాజు కూతురు లలిత విద్యాపతిని చూసి, పక్కన సెలయేటి నుంచి నీళ్ళు తెచ్చి, ముఖంపై చల్లి స్పృహతెప్పించి, ఆయన్ను తన ఇంటికి తీసుకువెళ్ళింది.

లలిత తండ్రి బోయరాజు విశ్వావసు సత్వగుణ సంపన్నుడు. విద్యాపతి వినయవిధేయతలు,పాండిత్యం ఆయన్నెంతగానో ఆకర్షించాయి. విద్యాపతి బలహీనంగాఉండడంతోగూడెంలోనే కొన్నాళ్ళు గడపవలసి వచ్చింది. ఆ సమయంలో లలిత-విద్యాపతుల మధ్య పరస్పర అభిమానం ఏర్పడింది. విశ్వావసు ఆశీస్సులతో పెళ్ళి కూడా చేసుకున్నారు.

విశ్వావసు రోజూ తెల్లవారకముందే లేచి, పువ్వులతో ఎక్కడికో వెళ్ళి,సూర్యోదయమయ్యాక తిరిగి రావడం విద్యాపతి గమనించాడు. దానిని గురించి లలితను అడిగాడు. లలిత చెప్పడానికి



మొదట సంకోచించింది. ఆ తరవాత తన భర్తే కదా అని ఆ రహస్యం బయట పెట్టింది. అడవిలోని ఒక గుహలో పూజనీయమైన విశిష్ట వస్తువు ఏదో ఉందనీ, దానికి తమ పాలక వంశంలో పెద్ద కొడుకు రోజూ పూజ చేయడం ఆచారంగా వస్తున్నదనీ; అక్కడికి వెళ్ళే మార్గం ఆ ఒక్కడికి మాత్రమే తెలుసుననీ చెప్పింది. తరతరాలుగా వస్తూన్న తమ వంశాచారాన్ని తన తండ్రి క్రమం తప్పకుండా పాటిస్తున్నాడనీ తెలియజేసింది.

తాను వచ్చిన పని సగం పూర్తయినట్టు భావించిన విద్యాపతి, తను కూడా ఆ వస్తువును చూడాలని లలితకు చెప్పాడు. లలిత తండ్రికి తన భర్త కోరికను చెప్పి, ఆ అవకాశం కల్పించమని వేడుకున్నది. తండ్రి సరే అన్నాడు గాని, విద్యాపతి కళ్ళకు గుడ్డ కట్టి తీసుకువెళతానన్నాడు.

మరునాడు వేకువ జామున విశ్వావసు, అల్లుడి కళ్ళకు గుడ్డ కట్టి తన వెంటబెట్టుకుని బయలుదేరాడు. అడవిలోని గుహలోకి చేరాక కళ్ళకుకట్టినగుడ్డనువిప్పాడు.విద్యాపతి హృదయం పులకరించింది. చిన్న పేటికలో ఉన్న శిలలాంటి



వస్తువు దివ్యతేజస్సుతో జ్వలించడం దర్శించాడు. తాను వచ్చిన పని ఇలా సఫలమౌతున్నందుకు ఆనందించాడు.తనకు దారి చూపి నడిపిస్తూన్న దేవుడికి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకున్నాడు! మళ్ళీ కళ్ళకు గుడ్డ కట్టుకుని మామతో తిరిగి వచ్చాడు.

వర్షాకాలం ఆరంభమయింది. త్వరలో తిరిగి వస్తానని లలితకూ, విశ్వావసుకూ నచ్చచెప్పి, విద్యాపతి అక్కడి నుంచి తిన్నగా అడవిలోని గుహకు వెళ్ళి అక్కడవున్న రహస్య వస్తువును అపహరించుకుని శరవేగంతో రాజధానీ నగరం చేరాడు. గుహవద్దకు ఆయనకు మార్గం ఎలా తెలిసిందనుకున్నారు? విశ్వావసు వెంట వెళు తూన్నప్పుడు గుప్పెడు ఆవాలు తీసుకుని విద్యా పతిఆయనకు తెలియకుండా దారివెంట రాలుస్తూ వెళ్ళాడు.వానలు ప్రారంభంకావడంతో అవి మొలి చాయి. ఆ మొలకల సాయంతో ఆయన గుహను చేరుకోగలిగాడు.

విద్యాపతిని చూడగానే రాజు ఆనందానికి అవధులు లేకుండాపోయాయి.

ఆ నాటి రాత్రి రాజుకు మరొక కల వచ్చింది. ''సముద్రం నుంచి ఒక దుంగ కొట్టుకు వస్తుంది. ఆ దుంగతో విగ్రహం చేయించి, అందులో విద్యాపతి తెచ్చిన దివ్య వస్తువును నిక్షిప్తం చేసి ప్రతిష్ఠించు,'' అన్న దివ్యస్వరం వినిపించింది.

మరునాడు రాజు రాణీ వెంటరాగా, తన పరి వారంతో సముద్రతీరానికి చేరాడు. నిజంగానే అలల మీద ఒక దుంగ తేలుతూ రావడం కని పించింది. అది తీరాన్ని సమీపించడంతో, కొందరు భటులు పడవలలో వెళ్ళి దానిని గట్టుకు చేర్చ డానికి ప్రయత్నించారు. కాని సాధ్యపడలేదు. మరికొందరు పడవలలో వెళ్ళి దుంగకు తాళ్ళు కట్టిలాగారు. రాలేదు. ఆఖరికి బలమైన పగ్గాలు తెచ్చి కట్టి, ఏనుగులతో లాగించారు. అయినా దుంగ ఒక్క అడుగు కూడా ముందుకు జరగ లేదు.

నిరాశతో రాజదంపతులు కన్నీళ్ళ పర్యంతమై పోయారు. ఒక్క క్షణం రాజు కళ్ళు మూసు కున్నాడు. ఆయన మనోనేత్రాలకు స్పృహ తప్పి పడిపోయివున్న విశ్వావసూ, ఆయనకు పరి చర్యలు చేస్తూన్న లలితా కనిపించారు.

విద్యాపతి దారి చూపగా రాజు, మంత్రు లను వెంటబెట్టుకుని విశ్వావసు ఉన్న అడవికేసి బయలుదేరాడు. విశ్వావసును కలుసుకుని విద్యాపతి చేసిన పనికి రాజు క్షమాపణలు చెప్పాడు. ఆ తరవాత ఆయన మాత్రం పూజిస్తూ వచ్చిన, విశేష వస్తువుకు అశేష భక్తుల పూజలందుకునే సమయం ఆసన్నమయిందనీ; అందుకే భగవత్ సంకల్పానుసారం దానిని పూరీ దేవాలయంలో ప్రతిష్ఠించే ప్రయత్నం జరుగుతున్నదనీ విశ్వా వసుకు రాజు వివరించాడు. విశ్వావసు కూడా రాజు ఉన్నత ఆశయాన్ని అర్థం చేసుకున్నాడు. ఆయన వెంట రాజధానికి వచ్చి, పడవలో సము ద్రంలోకి వెళ్ళి కదలామెదలక వున్న దుంగను తాకాడు. ఆ తరవాత భటులు దుంగను సుల భంగా తీరానికి లాగ గలిగారు!

పూరీ పట్టణంలో శిలావిగ్రహాలు చెక్కే శిల్పు లకు తక్కువ లేదుగానీ, కొయ్య విగ్రహాలు చెక్కే

వాళ్ళు, అదీ దైవవిగ్రహాలు మలిచేవారు అసలే లేరు. చివరికి ఒక వృద్ధుడు వచ్చి తాను ఆ పని చేస్తానన్నాడు. అయితే, అందుకు ఒక నిబంధన విధించాడు. తాను దైవ విగ్రహాలను చెక్కి పూర్తి చేసేంతవరకు తనకు ఎవరూ ఆటంకం కలిగించ కూడదనీ, తనను చూడకూడదనీ చెప్పాడు. రాజు అందుకు అంగీకరించాడు. రాజభవనంలో వృద్ధ శిల్పికి ఒక విశాలమైన గది కేటాయించబడింది. దుంగతో, పనిముట్లతో వృద్ధుడు ఆ గదిలోకి వెళ్ళితలుపులు మూసుకున్నాడు.రాణి గుండిచా దేవి ఆసక్తి కొద్దీ తలుపులకు చెవులు ఆనించి వినేది. సుత్తి, ఉలి చప్పుళ్ళు విని ఆనందించేది. కొన్ని రోజులు గడిచింది. ఆ తరవాత వరసగా రెండురోజులు ఆ చప్పుళ్ళు వినబడడం ఆగి పోయింది. వృద్ధశిల్పికేమైనా అయిందేమో అన్న అనుమానంతో తలుపు కొద్దిగా తెరిచి చూసింది. విగ్రహం మలుస్తూన్న వృద్ధుడు తల తిప్పి చూసి ఆ క్షణాన్నే అదృశ్యమైపోయాడు.దేవలోకం నుంచి విశ్వకర్మే వృద్ధుడి రూపంలో వచ్చాడని చెబుతారు.

విగ్రహం అసంపూర్తిగా మిగిలిపోయింది. అందులోనే దివ్యవస్తువును నిక్షిప్తం చేసి ప్రతి ష్ఠించారు. ఆ రహస్య వస్తువు శ్రీకృష్ణ భగవానుడి అవశేషాలు కావచ్చు. విశ్వావసు కృష్ణుడి పాదాన్ని మృగమనుకొని బాణంతో కొట్టిన జరుడనే బోయ వాడి వంశానికి చెందిన వాడని చెబుతారు. ఆలయ గర్భగృహంలో శ్రీకృష్ణ విగ్రహంతోపాటు బలభద్ర, సుభద్ర విగ్రహాలు ఎప్పుడు ప్రతిష్ఠించబడినవో తెలియదు.

శ్రీకృష్ణబలరాములు గోకులం నుంచి మధు రకు బయలుదేరిన సందర్భాన్ని పురస్కరించు కుని రథోత్సవాలు జరుపుతారు.

అందరూ నిశ్శబ్దంగా కథ విన్నారు. "అవునూ, లలిత ఏమైంది? ఆమెను గురించి చెప్పనేలేదు," అని అడిగింది శ్యామల.

"పూరీకి వచ్చి భర్తతో ఆనందంగా జీవించింది. విద్యాపతి - లలిత సంతానానికి ఆలయంలో అర్చ కుల అంతస్తు కల్పించారు.లలిత బోయయువతి అన్న విషయం మీకు గుర్తుంది కదా? ఆమె సంతానం ఆలయ పూజారులు కావడానికి ఆమె కులం అవరోధం కాలేదు. మన పూర్వుల ఉన్నత మనస్తత్వానికి ఇదొక ఉదాహరణ. లలిత- విద్యా పతి సంతతికి చెందినవారు 'భక్తులకు దారి చూపేవారు' అన్న పేరుతో ఇప్పటికీ ఉన్నారు!" అన్నాడు దేవనాథుడు.

"కథ తెలిసింది కాబట్టి, జగన్నాథ రథోత్స వాలను టీవీలో మరింత ఆనందంగా చూసి అనుభవించగలం, తాతయ్యా!" అన్నాడు సందీ పుడు సంతోషంగా. —(ఇంకావుంది)



# తెలివి పెరిగింది!

పొన్నపల్లి గ్రామంలోవున్న సత్రానికి, ఒక రాత్రివేళ శీనయ్య, గోపయ్య అనే బాటసారులు వచ్చారు. భోజనాలయ్యాక ఇద్దరూ సత్రం అరుగుమీద పడుకున్నారు. గోపన్నకు కాస్త కునుకుపట్టే సమయంలో శీనయ్య,తన సంచీలోంచి ఏదో తీసి నోట్లో వేసుకుని చప్పరించసాగాడు. గోపయ్య, శీనయ్య చప్పరించేది పోకచెక్క అనుకుని, ''పోకచెక్క పలుకా? నాకూ ఒకటివ్వు,'' అన్నాడు.

''పోకచెక్కకాదు, సపోటాగింజలు చప్పరిస్తున్నాను. ఈ ఉదయమే, మా ఇంట్లో ఒక తాళపత్ర గ్రంథం దొరికింది. అందులో సపోటాగింజల్ని ఊసి పారెయ్యకుండా చప్పరిస్తే తెలివి తేటలు మహా పెరుగుతాయని రాసివుంది.అందుకే బాగా చప్పరించి, ఆ తర్వాత ఊసి వేస్తాను,'' అన్నాడు శీనయ్య.

''అలాగా! నేను తీర్థయాత్రలకు బయలుదేరాను. ఉన్న తెలివితేటలు మరికాస్త మెరుగైతే, దారిలో తారసపడే మోసగాళ్ళ నుంచి సులువుగా తప్పించుకోవచ్చు. నాకూ ఒక గింజయివ్వు!'' అన్నాడు గోపయ్య.

''ఉచితంగా ఇవ్వడం కుదరదు. నాలుగు రూపాయిలిచ్చి, నాలుగు తీసుకో,'' అన్నాడు శీనయ్య.

గోపయ్య ఒక క్షణం ఆలోచించి, శీనయ్యకు నాలుగు రూపాయిలిచ్చి నాలుగు గింజలు తీసుకుని, అందులో ఒకటి నోట్లో వేసుకుని చప్పరించసాగాడు. అంతలో అతడికి హఠాత్తుగా తను మోసపోయినట్టు అనుమానం కలిగింది.

అతడు శీనయ్యకేసి కోపంగా చూస్తూ,'' పచ్చి మోసం! నాలుగు రూపాయలకు నాలుగు సపోటాపళ్ళే కొనొచ్చు! నీ మోసం సంగతి సత్రం యజమానికి చెపుతాను,'' అన్నాడు.

''ఆహాఁ, చూశావా! పది నిమిషాలైనా గడవకుండానే నీ తెలివితేటలెంతగా పెరిగాయో? ఆశ్చర్యం!'' అంటూ పెద్దగా నవ్వాడు, శీనయ్య.

ఈ జవాబు విన్న గోపయ్యకు, తనకు నిజంగానే తెలివి తేటలు పెరిగాయేమో అన్న శంక కలిగి, మరి మాట్లాడకుండా వూరుకున్నాడు.

–వారణాశి శ్రీరామకృష్ణ





# స్నేహధర్మం

అనుకోకుండా మంచి సంబంధం రావడంతో, అనంతుడికేమీపాలుపోలేదు. అమ్మాయికి ఆ ఏడు పెళ్ళి చేయడం కష్టమే! ఆర్థికంగా ఇబ్బందుల్లోవున్నాడతను. కారణం, గత రెండేళ్ళుగా వర్షాల్లేవు, పంటల్లేవు! అలా అని మంచి సంబంధాన్ని వదులుకోవడానికీ మనసు రావడంలేదు.

ఆలోచనల్లో అతడుంటే, భార్య కలగజేసుకుని, "ఎందుకంత ఆలోచిస్తారు? మీకు రాజధానీ నగరంలో ఇద్దరు మంచి మిత్రులున్నారు గదా. వారు మంచి స్థితిలో కూడా ఉన్నారు. మీరు అడిగారంటే, వాళ్ళు కాదనే ప్రసక్తి వుండదు. మన అవసరానికి కావలసింది పదివేల వరహాలు. వర్షాలు పడి పంట చేతికిరాగానే, వారివద్ద తీసుకున్నది తిరిగి తీర్చేయవచ్చు," అన్నది.

భార్య మాటలు అనంతుడికి నచ్చాయి. కాని ఏదో మొహమాటం వెనక్కు లాగింది. సుశాంతుడు, సుమంతుడు, తను బాల్యమిత్రులు. చిన్ననాటి నుంచి ఒకరంటే మరొకరికి ప్రాణం. చదువయ్యాక సుశాంతుడు తండ్రి ఇచ్చి పోయిన వ్యాపారాన్ని నగరంలో కొనసాగిస్తున్నాడు. సుమంతుడు రాజు కొలువులో ఉద్యోగంలో కుదిరి అంచెలంచెలుగా ఎదిగాడు. అయినా, తనెప్పుడూ వారిని ఏదీ కోరింది లేదు. ఇన్నేళ్ళుగా స్నేహం మాత్రం చెక్కుచెదరలేదు.

తటపటాయిస్తున్న అనంతుడితో భార్య, "ఏదో తప్పు చేస్తున్నట్లు బాధపడుతున్నారు మీరు. అవసరానికి అప్పు చేయటం నేరం కాదు. అందులోనూ వారు మీ ఇబ్బందిని, తమ ఇబ్బందిగా భావించే మంచి మనసు గలవారు. అందులో ఎటువంటి సందేహం లేదు!" అన్నది.

ఆ మాటలతో అనంతుడు, స్థిరమైన అభిప్రాయానికి వచ్చాడు. ఆ రోజు మధ్యాహ్నమే బయల్దేరి నగరానికి చేరి, సుమంతుడింటికి వెళ్ళాడు. కొలువు నుంచి వచ్చిన సుమం

గంగిశెట్టి శివకుమార్



తుడు మిత్రుడి రాకకు చాలా సంతోషిం చాడు. కుశల ప్రశ్నలూ అవీ అయ్యాక అనం తుడు, తను వచ్చిన పని గురించి మెల్లగా చెప్పాడు.

సుమంతుడు నొచ్చుకుంటూ, ''నీకవసర మైన పదివేల మొత్తం, ఏమంత పెద్దది కాదు. అందులోనూ నీ అవసరం కూడా చిన్నది కాదు. కానీ వచ్చిన చిక్కల్లా ఏమంటే, నేను ఎన్నాళ్ళుగానో అనుకుంటూ వస్తున్న, కొత్త ఇల్లు కట్టుకోవడం అనే పని, ఈ ఏడు చేద్దా మనుకుంటున్నాను. తాతల నాటి ఆ పాత ఇల్లు స్థానే కొత్త ఇల్లు కట్టదలచాను. ఆ పని లేకపోతే నీకు డబ్బు సర్దడం పెద్ద సమస్య కాదు. అలా అని అమ్మాయి పెళ్ళి నువ్వు వాయిదా వేయనవసరంలేదు. మన సుశాం తుడున్నాడుగదా,వెళ్ళి అడుగు, తప్పక సర్ద గలడు. నాకానమ్మకంవుంది,'' అన్నాడు.

అనంతుడు అక్కడి నుంచి బయలుదేరి సుశాంతుడి ఇంటికి వెళ్ళాడు. సుశాంతుడి భార్య, ''రండి, అన్నయ్యా!'' అంటూ ఆహ్వానించి మర్యాదలు చేసింది. కొట్టు కట్టేసి ఇంటికి వచ్చిన సుశాంతుడు, మిత్రుణ్ణి చూడగానే కౌగలించుకుని యోగ క్షేమాలడిగాడు.మిత్రులిద్దరూ కబుర్లు చెప్పు కుంటూ భోంచేశారు. తర్వాత అనంతుడు, సుశాంతుడితో తను వచ్చిన విషయం, సుమంతుణ్ణి కలిసిన సంగతీ,ఆ విషయంలో అతడికున్న ఇబ్బందీ— అన్నీ వివరంగా చెప్పాడు.

అంతా విన్న సుశాంతుడు, బాధపడు తున్నట్టు మొహం పెట్టి, ''ఎప్పుడూ ఏదీ అడగని నువ్వు, ఇవాళ అవసరమై వస్తే, సహాయపడలేకున్నానే అనిబాధగా వుంది,'' అన్నాడు.

''సరే, ఇంతకూ ఆ పదివేలూ సర్దడంలో నీకొచ్చిన ఇబ్బందేమిటి?'' అని అడిగాడు అనంతుడు ఆతృతగా.

''మా తండ్రి ఇచ్చి పోయిన వ్యాపారమే ఇంతకాలం చేస్తూ వచ్చాను. ఎందుకో ఈ మధ్య సముద్రవ్యాపారం చేసి కోట్లు గడించా లన్న కోరిక ఎక్కువైంది నాలో. ఆ దిశగా ప్రయత్నాలు ప్రారంభించాను. సముద్ర వ్యాపారమంటే పెట్టుబడులు దండిగా కావాలి గదా! లాభాలూ ఆ స్థాయిలోనే వుంటా యనుకో. ఆ వ్యాపారం కోసం, నాదగ్గరున్న ధనమంతా కేటాయించాను, అదీ సంగతి! సరే, పొద్దుపోయింది, పడుకో. పొద్దున్నే మాట్లాడుకోవచ్చు,'' అంటూ సుశాంతుడు తన గదిలోకి వెళ్ళాడు.

ఆ సమయంలో, సుశాంతుడి పదేళ్ళ కూతురు రాధ, తను సాయంకాలం విష్ణాలయంలో విని వచ్చిన పురాణ కాలక్షేపం గురించి తల్లితో మాట్లాడుతున్నది.

"నువ్వూ, నాన్నా ఎప్పుడైనా పురాణ కాలక్షేపాలు వినడానికి వెళ్ళారా?" అని అడిగింది రాధ.

"వెళ్ళకేం, నీ వయసంత చిన్నవాళ్ళుగా వున్నప్పుడూ, ఆ తర్వాత తీరిక సమయాల్లో కూడా వెళ్ళాం," అన్నది తల్లి.

"అలాగా! నాకు పురాణం శాస్త్రులు గారు చెప్పింది, అంతగా తెలియలేదు. కర్ణుడికి, దుర్యోధనుడు బాగా సాయం చేశాడు. కుచేలుడికి, శ్రీకృష్ణుడూ చాలా డబ్బిచ్చి సాయపడ్డాడు. ఇద్దరిలో ఎవరి సాయం గొప్పది?" అని అడిగింది రాధ.

"ఈ ప్రశ్న మీ నాన్న నడుగు. ఆయన పురాణ కథలూ అవీ నాకన్న ఎక్కువ చదివాడు, విన్నాడు," అన్నది సుశాంతుడి భార్య.

కూతురు తనను అడగబోయేంతలో సుశాంతుడు, "తల్లీ! మీ అమ్మ చెప్పేది ఏనాటి మాట! వ్యాపారం, లాభాలు, మరింత లాభాలు తప్ప - మిగతా విషయాలన్నీ మరిచిపోయాను. మీ అమ్మ నీ సందేహాన్ని ఎలా తీరుస్తుందో నాకూ వినాలనివున్నది," అంటూ భార్యకేసి చూశాడు.

సుశాంతుడి భార్య, భర్తకేసి ఒకసారి తల తిప్పి చూసి, "నిజంగా వినాలనివున్నదా?" అని కూతురును దగ్గరకు తీసుకుని, "నీ సందేహాన్ని ఏపాటి తీర్చగలనో, నాకు తెలియదు. ప్రపంచంలో అన్నిటికంటే గొప్పది, వాళ్ళ వాళ్ళ ఆలోచనా, అవసరాలను బట్టి-



కొందరు ధనం అనీ, కీర్తి, ప్రతిష్ఠ, పలుకుబడీ అనీ అనుకుంటూంటారు. నాకు మటుకు అన్నిటికన్నా స్నేహం గొప్పదనిపిస్తుంది. కర్ణుడిపట్ల దుర్యోధనుడి స్నేహంలో పూర్తి స్వార్థం వున్నది. అతణ్ణి తన శత్రువైన అర్జునిడికి సాటి అని నమ్మి, అంగరాజుగా పట్టాభిషేకం చేశాడు. ఇక శ్రీకృష్ణుడు, కుచేలుడికి చేసిన సాయంలో ఆవగింజంత అయినా స్వార్థం లేదు. కుచేలుడు తనకు తానై అడగకుండానే, శ్రీకృష్ణుడు అతడికి ధనం, గొప్ప భవనాలూ, దాసదాసీ జనాన్నిచ్చి, తన స్నేహా నికి వన్నె తెచ్చుకున్నాడు!'' అన్నది.

రాధ చప్పట్లు చరిచి, ''నాన్నా, అమ్మ చెప్పింది నిజమా? నా సందేహం తీరిపోయిందా?'' అని అడిగింది.

''నీ సందేహం తీరిపోయిందోలేదో నీకు తెలియాలి? నేను కొన్నేళ్ళుగా కోట్లకు పడగలెత్తాలనే ఆలోచనల్లో తలమునకలవుతూ, ఈ క్షణం వరకూ అన్ని ధర్మసందేహాలకూ అతీతంగా బతికాను. ఇప్పుడు నాలోనూ ఒక ధర్మసందేహం తలెత్తింది. దానికి జవాబు మీ అమ్మ మాటలతో తీరిపోయింది,'' అన్నాడు సుశాంతుడు.

ఆ మర్నాడు ఉదయం సుశాంతుడు, అనంతుడితో ఫలహారం చేస్తూ, ''నా సముద్ర వ్యాపార ప్రయత్నం కొంతకాలం అలా వుంచినా మునిగిపోయేదేం లేదు. అందుకోసమని చాలాపెద్దమొత్తమే దాచాను. అందులో నుంచి పదివేల వరహాలుకాదు, ఇరవైవేల వరహాలు తీసుకుపో. మీ అమ్మాయి పెళ్ళి మాత్రం ఎలాంటి లోటూ రాకుండా జరిపించు,'' అన్నాడు.

అనంతుడు తనకు పదివేలు చాలని చెప్పి, డబ్బు తీసుకుని సుమంతుడి వద్దకు తిరిగి వచ్చి, జరిగింది చెప్పాడు. అంతా విన్న సుమంతుడు కాస్త తలవంచుకుని, ''సుశాంతుడి కొచ్చిన ఆలోచన నాకు రాలేదు. నేను కూడా కొత్త ఇల్లు కట్టే ఆలోచన పై ఏడాదికి వాయిదా వేసుకునివుంటే, వచ్చే నష్టం ఏమీ వుండేదికాదు. స్నేహితుడికి తోడ్పడ్డానన్న తృప్తి ఉండేది!'' అన్నాడు.

''సుమంతా! నువ్వు ఇప్పుడన్న ఆ ఒక్క మాట, సుశాంతుడిచ్చిన పదివేలవరహాలూ పుచ్చుకునేటప్పుడు కలిగించినంత ఆనందం కలిగిస్తున్నది. ఇక వెళ్ళి వస్తా!'' అంటూ, అనంతుడు సంతోషంగా తన గ్రామానికి బయల్దేరాడు.





లుగా మూగుతూన్న ఈగలు!

సిద్ధార్థ వచ్చిన విషయం తెలిసి ఇంటి నుంచి వెలుపలికి వచ్చిన ఎదురింటి రావు భార్య, సిద్ధార్థను పలకరించాక, పనిలోపనిగా తన వెంట తెచ్చిన చెత్తను ఇంటి ముందున్న చెత్తకుండీ పక్కన పడవేసి మరీ వెళ్ళింది . ఆ దృశ్యం చూసిన సిద్ధార్థకు డోకు వచ్చినంత పనయింది.

సూర్యుడు ఉదయించినప్పటికీ, పొగమంచు కారణంగా కనిపించడంలేదు. ఇళ్ళన్నీ పాతబడినట్టు కళాహీనంగా కనిపించాయి.

ఈ మార్పులనుఅతడు భరించలేకపోయాడు. కొంతసేపటికి అతడికి విపరీతంగా తుమ్ములు రాసాగాయి. "గాలిలో దుమ్ము భరించలేకుండా ఉన్నాను," అన్నాడు సిద్ధార్థ. "నాలుగురోజుల్లో అంతా సర్దుకుపోతుందిలే," అన్నారు తల్లిదండ్రులు నవ్వుతూ.

తల్లి తనకు భోజనం వడ్డించేప్పుడు ఆమె చేతుల మీద ఏవో మచ్చలు కనిపించాయి. ఏమిటని అడిగాడు సిద్ధార్థ. "అలర్జీ! ఇలాంటివన్నీ ఢిల్లీలో స్త్రీలకు సర్వసాధారణం బాబూ," అని తేలిగ్గా కొట్టి పారేసింది తల్లి.

ఆ రాత్రి విచారంతో పడుకున్నాడు సిద్ధార్థ. అర్ధరాత్రి సమయంలో హఠాత్తుగా చప్పుడు కావడంతో ఉలిక్కిపడి లేచాడు. తండ్రి గదిలో లైటు వెలుగుతోంది. సిద్ధార్థ వెళ్ళి చూశాడు. తండ్రి ఊపిరి పీల్చుకోవడానికి ఆయాస పడుతున్నాడు. అమ్మ ఏవో మాత్రలు ఇచ్చి పరిచర్యలు చేస్తూ, "ఇది మామూలే! కాస్సేపటికి సర్దుకుంటుంది. నువ్వెళ్ళి పడుకో, బాబూ," అన్నది.

ఉదయం టిఫిన్ చేస్తూ సిద్ధార్థ తల్లిదండ్రులతో, "చదువు పూర్తికాగానే అమెరికాలోని ఒక సాఫ్ట్‌వేర్ కంపెనీలో ఉద్యోగం ఇస్తామన్నారు. అయినా, దేశాభిమానం కొద్దీ వద్దని వచ్చేశాను. అయితే, ఇక్కడి పరిస్థితులు చూస్తూంటే ఈ మురికిలో బతకలేననుకుంటున్నాను. మీరేం అనుకోకపోతే అమెరికా వెళ్ళిపోతాను," అన్నాడు.

ఆ మాట విని తల్లిదండ్రులు దిగ్భ్రాంతి చెందారు. "ఆఖరి రోజుల్లో నువ్వు మాతో ఉంటే అదే చాలు. ఆలోచించి చూడు బాబూ!" అన్నది తల్లి కొంగుతో కళ్ళు తడుచుకుంటూ.

"అది సరే నమ్మా. అయినా ఇంటి చుట్టూ ఈ చెత్త దిబ్బలేంటి? రాత్రి నాన్నకు హఠాత్తుగా ఉబ్బసం ఎందుకు వచ్చిందో తెలుసా? శుభ్రమైన గాలి లేక. నా చిన్నప్పుడు మన కాలనీలో ఎన్ని చెట్లుండేవి? అవన్నీ ఇప్పుడేమయ్యాయి? మీ చేతి మీది మచ్చలు ఎందుకు వచ్చాయి. ఈ కాలుష్యం వల్లే. ఇన్ని బాధలు అనుభవిస్తూకూడా వాటిని గురించి పట్టించుకోకపోతే ఎలా? 'గ్రీన్ హౌస్ ఎఫెక్ట్' 'గ్లోబల్ వార్మింగ్' మొదలైన విషయాలన్నీ సదస్సులకూ, సమావేశాలకూ పరిమితమైపోవలసిందేనా? వాతా

**వాయు కాలుష్యం!**

మన రాజధాని ఢిల్లీ, ప్రపంచంలోని నాలుగవ కలుషిత నగరం అన్న విషయం మీకు తెలుసా?



## వాననీళ్ళూ కలుషితమే!



థాయ్‌లాండ్ పారిశ్రామిక ప్రాంతాలలో కురిసే వాననీళ్ళలో సైతం ఆమ్లగుణం ఎక్కువగా ఉండడం వల్ల అవి తాగడానికి పనికిరావడం లేదు. ప్రభుత్వ ఆరోగ్యశాఖ మంత్రి మండలి—వర్షంనీళ్ళు పట్టి భద్రపరచాలనుకునేవాళ్ళు, వర్షం ప్రారంభమయిన ఒక గంట తరవాతే పట్టుకోవాలని అక్కడి ప్రజలను హెచ్చరించింది!

వరణ కాలుష్య నివారణకు మనలో ప్రతి ఒక్కరూ మనవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించాలి కదా!'' అన్నాడు సిద్ధార్థ ఆవేశంతో.

''నువ్వు చెప్పేవి వినడానికి బాగానే ఉన్నాయి బాబూ. అయినా వాటిని ఆచరణలో పెట్టడం కష్టం. అంతెందుకు? మన ఇంటి ముందు చెత్త పడేయవద్దని, రావుగారి భార్యకు వందసార్లు చెప్పాం. వినిపించుకుంటే కదా?'' అన్నాడు తండ్రి.

మార్పు తీసుకురావడం అసాధ్యం అన్న దానితో సిద్ధార్థ ఏకీభవించలేకపోయాడు. తానే నడుం బిగించి స్వయంగా కార్యరంగంలోకి దిగాలని నిర్ణయించాడు. ఒక రకమైన జీవితానికి అలవాటు పడిన పెద్దలను మార్చడం సులభం కాదు గనక, అతడి దృష్టి పిల్లల మీదికి మళ్ళింది.

ఆ రోజు సాయంకాలం ఇంటికి కాస్త దూరంలో వున్న ఖాళీ స్థలంలో ఓ పదిమంది పిల్లలు ఆడుకోవడం చూడగానే అతడి మనసులో మెరుపులా ఒక ఆలోచన తోచింది. అతడు వాళ్ళ దగ్గరికి వెళ్ళి కొన్ని చాక్లెట్లు ఇచ్చాడు. వాటిని తీసుకుంటూ ఒక కుర్రవాడు, ''ఇవి అమెరికా చాక్లెట్లా అంకుల్?'' అని అడిగాడు.

''అవును, బాబూ,'' అన్నాడు సిద్ధార్థ.

''అమెరికా చాలా అందంగా ఉంటుందా అంకుల్?'' అని అడిగాడు కిరణ్ అనే ఇంకో కుర్రాడు. ''అవును. అందంగా ఉంటుంది!'' జవాబిచ్చాడు సిద్ధార్థ.

''మీరు మళ్ళీ అమెరికా వెళ్ళిపోతారు కదూ? ఇండియా డర్టీ ప్లేస్. అంతేనా?'' అన్నాడు కిరణ్.





''లేదు. నేను అమెరికాకు తిరిగివెళ్ళడం లేదు. ఇండియాను అమెరికాగా మార్చబోతాను,'' అన్నాడు సిద్ధార్థ దృఢమైన కంఠస్వరంతో.

''ఎలా మార్చగలవు?'' అని అడిగాడు అందరిలోకీ చిన్నవాడైన అరుణ్.

''మార్చడం చాలా సులభం!'' అని ఒక్క నిమిషం అందరికేసి నవ్వుతూ చూసి, ''అయితే, నేనొక్కణ్ణే ఒంటరిగా మార్చలేను. మీ అందరి సహకారం కావాలి,'' అన్నాడు సిద్ధార్థ.

పిల్లలు ఆనందంతో ఎగిరి గంతేశారు. ఇంత వరకు వాళ్ళ సాయం అడిగిన వాళ్ళు ఎవరూ లేరు. పట్‌పట్ గంజ్ కాలనీని శుభ్రపరచి అందంగా తీర్చిదిద్దాలని నిర్ణయించారు. దానికి 'ఆపరేషన్ బ్యూటిఫుల్' అని ముద్దు పేరు కూడా పెట్టారు.





రోజూ సాయంకాలం స్కూలు ముగియగానే పిల్లలు సిద్ధార్థ దగ్గరికి వెళ్ళేవారు. మొదట చెట్ల మొక్కలు తెచ్చి వీధులలో, కాలనీ చుట్టూ నాటారు. వంతుల వారీగా నీళ్ళు పట్టడం ప్రారంభించారు. ఆ తరవాత తలా కొంత డబ్బులు వేసుకుని, చీపురు కట్టలూ, తట్టలూ, బుట్టలూ కొన్నారు. సాయంకాలాలలో రోజూ కాలనీని శుభ్రంగా ఊడ్చేవారు. గోతులు తవ్వి, చెత్తా చెదారం అందులో పడవేసి పూడ్చి ఎరువులు తయారు చేసే పద్ధతిని సిద్ధార్థ వాళ్ళకు నేర్పాడు. మూడు నెలలలో కాలనీ రూపమే మారిపోయింది. ఎక్కడ చూసినా పచ్చదనం- పరిశుభ్రత వెల్లివిరిసింది. రావు భార్యలాంటి వాళ్ళు వీధిలో చెత్త వేయడానికిసిగ్గుపడ్డారు.పిల్లలను చూసి,కాలనీలో కొందరు స్త్రీలు తామే మొక్కలు నాటి పెంచసాగారు. ఇంటి ముందు చాలినంత చోటులేని వారు తొట్టెలలో పూలమొక్కలు పెంచసాగారు. మరి కొందరి డాబాఇళ్ళ మీద రూఫ్ గార్డెన్లు తయారయ్యాయి.

అనుకున్నది సాధించినందుకు సిద్ధార్థ ఆనందించాడు. కార్లు వదిలి సైకిళ్ళలో స్కూళ్ళకు వెళ్ళడం మంచిదని పిల్లలకు సలహా ఇచ్చాడు. అలా చేస్తే వాయు కాలుష్యం తగ్గడంతోపాటు పెట్రోలుకూడా పొదుపు చేయవచ్చని చెప్పాడు.

ఆరు నెలలయింది. సిద్ధార్థ ఢిల్లీలోనే మంచి ఉద్యోగం చూసుకుని, తల్లిదండ్రులకు సంతోషం కలిగించాడు.

మిత్రుల పర్యావరణ పరిరక్షణ కార్యక్రమం మాత్రం అంతటితో ఆగిపోలేదు. రోజూ కొత్త కొత్త తీర్మానాలతో పథకం ముందుకు సాగుతూనే ఉంది. పర్యావరణ పరిరక్షణకు హాని కలిగించే పాలిథీన్, ప్లాస్టిక్ క్యారీ బ్యాగులు ఉపయోగించ కూడదని ఇటీవల ఒక నిర్ణయం తీసుకున్నారు. ఇప్పుడు కూడా మీరు పద్ పద్ గంజ్ కాలనీకి వెళితే — అరుణ్, కిరణ్, దీపక్, చందర్ మిత్రులు షాపింగ్‌కు వెళ్ళేటప్పుడు గుడ్డ సంచులనూ, జ్యూట్ బ్యాగులనూ మాత్రమే తీసుకు వెళ్ళడం చూడవచ్చు! —జి.విద్య

### నవ్వుకోవడానికి కాదు!?!



# ఏరు మళ్ళీ పారుతోంది!

ప్రకృతి రక్షణే
మన రక్షణ






వినయ్ తన బుల్లి కాళ్ళ సత్తువకొద్దీ పరిగెత్తు తున్నాడు. ఎదురుగా వస్తూన్న వాళ్ళకు ఢీకొన గలమన్న భయంకూడా లేకుండా పరిగెత్తసాగాడు. హఠాత్తుగా సొమ్మసిల్లి పడిపోయిన తన కుక్కపిల్ల రామును రెండు చేతులతో ఎత్తుకుని, పరిగెత్తు తున్నాడు. "ఎందుకిలా జరిగింది?" అన్న బాధతో వాడిమనసు విలవిలలాడుతోంది. వాడికళ్ళ నుంచిధారలుధారలుగాకన్నీళ్ళుకారుతున్నాయి.

కొంతసేపటికి జంతువైద్యశాలను చేరు కున్నాడు. "నాకుక్కపిల్ల రాము డాక్టర్! నేనూ, అదీ గ్రౌండ్‌లో ఆడుకుంటున్నాం. ఉన్నట్టుండి కళ్ళు మూసుకుని పడిపోయింది. నోటి నుంచి నురగ. ఏమైందో చూడండి డాక్టర్.రామును కాపా డండి డాక్టర్," అన్నాడు రొప్పుతూ. వాడికి కన్నీళ్ళు ఆగడంలేదు.

"ఏడవకు వినయ్. కుక్కపిల్లకు తినడానికి ఏమిచ్చావు? ఏం తాగింది?" అంటూ డాక్టర్ సుందరం కుక్కపిల్లను మేజా మీద పడుకోబెట్టి పరీక్షించి, "దీనికి విషప్రయోగం జరిగినట్టుంది!" అన్నాడు.

"విషమా? దీనికెవరు విషం పెడతారు? అదంటే అందరికీ ఇష్టమే!" అంటూ వినయ్ కొంతసేపు ఆగి, "ఏటిగట్టున ఆడుకుంటూం డగా అది ఒకసారి వెళ్ళి ఏట్లో నీళ్ళు తాగి వచ్చింది. అంతే!" అన్నాడు వినయ్.

"అలాగా! అంటే మన ఏటినీళ్ళే దీనికి విషంగా పరిణమించాయి," అన్నాడు డాక్టర్.



ఆ తరవాత విషం పోగొట్టడానికి మందులూ, సూది మందులూ ఇచ్చాడు గాని, ప్రయోజనం లేకపోయింది.కుక్కపిల్ల చచ్చిపోయింది. వినయ్ బావురుమన్నాడు. కలుషితమైన ఆ ఏటినీరు మరెందరి ప్రాణాలు తీయనుందో అన్న బాధతో డాక్టర్ గుండె బరువెక్కసాగింది. అయన ఆలోచనలు గతం కేసి పయనించాయి.

❦ ❦ ❦

దాదాపు పదేళ్ళ క్రితం గ్రామ సమీపంలో బనియన్లు తయారు చేసే ఫ్యాక్టరీ ఒకటి స్థాపించాలన్న పథకం వచ్చింది. అయితే, డా.సుందరం దానిని అప్పుడే గట్టిగా వ్యతిరేకించాడు. కొందరు యువకులను కలుపుకుని 'పర్యావరణ రక్షణా సమితి' ఏర్పాటు చేశాడు. ఫ్యాక్టరీ వస్తే ఉత్పన్నమయ్యే సమస్యలను గురించి గ్రామ ప్రజలకు తెలియజేయడానికి ప్రయత్నించాడు. అయితే, దానిని ఎవ్వరూ అంతగా పట్టించుకోలేదు. రాజకీయంగా పలుకుబడి గల ధనికుడు రాజశేఖరం ఆ ఫ్యాక్టరీ యజమాని కావడంతో ఎవరూ ఆయనకేసి వేలెత్తి చూపలేక పోయారు.

రైతులందరూ తమ పొలాలను ఫ్యాక్టరీ యజమానులకు మౌనంగా అప్పగించడం చూసి డాక్టర్ విస్మయం చెందాడు. కొందరైతే తమ పొలాలకు వాళ్ళిచ్చిన పెద్ద మొత్తాలను చూసి, మురిసిపోయారు. చాలామంది రైతులు వ్యవసాయాన్ని వదిలిపెట్టి ఫ్యాక్టరీలో ఉద్యోగులుగా చేరిపోయారు. భూతాల్లాంటి యంత్రాలు వచ్చాయి. చెట్లు నరకబడ్డాయి. ఎత్తుపల్లాలు చదును చేయబడింది. ఫ్యాక్టరీతోపాటు అక్కడ పనిచేసేవారికి ఇళ్ళు నిర్మంచవలసివచ్చింది. పైరు పండే భూములు ఇళ్ళ స్థలాలయ్యాయి. గ్రామం రూపురేఖలు పోల్చుకోలేనంతగా మారిపోయాయి!

ఎటుతిరిగినా పచ్చటి చెట్లతో, పక్షుల కిలకిలా రావాలతో ఏటిగట్టు ఎంతో ఆహ్లాదకరంగాఉండేది. ఏట్లో కావలసినన్ని చేపలు దొరికేవి. ఆ గ్రామానికే కాదు; చుట్టుపక్కల పదీ పదిహేను గ్రామాలకు తాగు నీరు, సాగు నీరు రెండింటికీ ఆ ఏరు ఒక్కటే

## రగులుతూన్న నదులు



దులు రగలడమా? విన
ానికి విడ్డూరంగా ఉంది
దూ! అయినా ఇది నిజం.
వ్ ల్యాండ్, ఓహియోల
ండా ప్రవహించే కుయాహోగానది 1969లో
గులు కున్నది.ఓహియో అమెరికాలోని ముఖ్యమైన
ారిశ్రామిక నగరం. ఏళ్ళ తరబడి ఫ్యాక్టరీల నుంచి
షపూరిత రసాయన పదార్థాలు నదిలో కలుస్తు
న్నాయి. అయితే పొరబాట్ల నుంచి ఎవరూ గుణ
ాఠాలు నేర్చుకోవడంలేదు. ఈ కలుషిత నదిని
అగ్నిప్రమాద భరితమైనదిగా ప్రభుత్వం పేర్కొంటు
న్నది!



ఆధారం. అయితే, ఫ్యాక్టరీ పని చేయడంమొదలు పెట్టాక అక్కడి పరిస్థితులు పూర్తిగా తారు మారయ్యాయి.

ఫ్యాక్టరీ నుంచి కలుషిత మిగులు జలాలు ఏట్లో కలిసేవి. క్రమంగా చేపలు తగ్గి పోయాయి. అక్కడక్కడా పక్షులు చచ్చిపడి కనిపించాయి. పంటల దిగుబడి తగ్గు ముఖం పట్టింది. ఇటీవలి కాలంలో జనంలో ఉబ్బసం లాంటి శ్వాసకోశ వ్యాధులూ, ఉదర వ్యాధులూ ఎక్కువయ్యాయి. ఏటి నీళ్ళే స్నానానికి వాడడం వల్ల గజ్జి, తామర వంటి చర్మవ్యాధులూ, కళ్ళ మంటలూ ఎక్కువయ్యాయి. అయితే, తమ బాధలన్నిటికీ మూల కారణం ఫ్యాక్టరీనుంచి వెలువడే కలుషిత జలాలే అని ప్రజలు గ్రహించలేక పోయారు. దుర్భర జీవనపోరాటానికి నాలుగు డబ్బులుంటే చాలు అన్న అభిప్రాయమే వాళ్ళ మనసుల్లో నాటుకు పోయింది.

అసలు విషయం గురించి గ్రామప్రజలకు వివరించడానికి డా.సుందరం తన మిత్రులతో కలిసి ప్రయత్నించాడుగాని, ఫలితం లేకపోయింది. ఇవాళ వినయ్ కుక్కపిల్ల కలుషిత జలం తాగి ప్రాణాలు పోగొట్టుకున్నది. జలకాలుష్య ప్రమాదాన్ని రాజశేఖరం దృష్టికి తీసుకురావడానికి ఇదే సరైన సమయం అని డాక్టర్ భావించాడు. ఎందుకంటే రాజశేఖరంగారబ్బాయే వినయ్. తన బిడ్డే బాధితుడు గనక, ఆయన ఈ విషయాన్ని సరైన కోణం నుంచి అర్థం చేసుకునే అవకాశం ఉందని డాక్టర్ ఆశించాడు.

❦ ❦ ❦

ఆయన తన పథకం గురించి మిత్రులకు చెప్పాడు. అందరూ కలిసి దానిని గురించి వివరంగా చర్చించారు. ఫ్యాక్టరీ నుంచి వెలువడే కలుషిత మిగులు జలాలను ఏట్లోకి వదలకుండా వాటిని శుద్ధీకరించి మళ్ళీఫ్యాక్టరీలో ఉపయోగించే పద్ధతిని చేపట్టమని రాజశేఖరానికి చెప్పి, ఒప్పించాలనుకున్నారు.

వాళ్ళు రాజశేఖరం ఇంటికి వెళ్ళారు. గుమ్మంలో సోఫాలో చుట్టచుట్టుకుని పడుకుని వినయ్ ఏడుస్తున్నాడు.రాజశేఖరం పక్కనకూర్చుని కొడుకును ఓదార్చడానికి ప్రయత్నిస్తున్నాడు. డాక్టర్‌నూ,ఆయనతో వచ్చిన మిత్రులనూ చూడగానే వినయ్ ఏడుపు తక్కున ఆపి, లేచి లోపలికి





వెళ్ళాడు. రాజశేఖరం వాళ్ళను ఏమిటి అన్నట్టు చూశాడు.

డాక్టర్ ఆయన దగ్గరికి వెళ్ళి, "ఈ రోజు మీ బాబు కుక్కపిల్లకు పట్టిన గతి, రేపు మరో జంతువుకో, మనిషికో పట్టాలని మీరు కోరుకుంటున్నారా?" అని అడిగాడు.

రాజశేఖరానికి ఆ మాట చెంపదెబ్బలా తగిలింది. ఒక్క నిమిషం మౌనం తరవాత, అందరినీ లోపలికి పిలిచి, కూర్చోమన్నాడు.

ఫ్యాక్టరీ నుంచి వెలువడే కలుషిత మిగులు జలాలు ఏటినీళ్ళను ఎలా విషతుల్యం చేస్తున్నదీ, దానివల్ల ప్రజలు అనుభవిస్తూన్న బాధలూ రాజశేఖరానికి, డాక్టర్ ఒక్కొక్కటిగా వివరించాడు.

లోపలినుంచి ఆ మాటలు విన్న వినయ్ బాణంలా బయటికి దూసుకువచ్చి తండ్రిని చూస్తూ, "నువ్వే నా రామును చంపేశావు. నువ్వు హంతకుడివి! నాకు నా రాము కావాలి! ఇప్పుడే రాము కావాలి!" అంటూ బిగ్గరగా ఏడ్వసాగాడు.

అందరూ అతడి కేసి జాలిగా చూడసాగారు.

"నీపై ఎంతో ప్రేమతో నీ కాళ్ళను చుట్టి చుట్టి వచ్చిన కుక్కపిల్లను చంపేశావు. నువ్వు హంతకుడివైపోయావు! ఎప్పుడో ఒకప్పుడు నన్నుకూడా చంపగలవు!" అన్నాడు వినయ్ తండ్రితో.

డాక్టర్ నెమ్మదిగా వినయ్‌ని సమీపించి, మెల్లగా పట్టుకుని, "వినయ్, ఈ విషయంలో మీనాన్నను మాత్రం నిందించడం తప్పు. ఆయన కావాలని ఈ పని చేయలేదు. ఆయన తప్పకుండాతన పొరబాటును సరిదిద్దుకోగలడని నేను విశ్వసిస్తున్నాను," అన్నాడు.

జరుగుతూన్నవన్నీ చూస్తూంటే రాజశేఖరంలో అంతర్మథనం ఆరంభమయింది. ఇన్నాళ్ళు ఏ కొందరో చాటుమాటుగా తనను తిట్టుకునేవాళ్ళు. ఇప్పుడేమో కన్నబిడ్డే తనను హంతకుడని పదిమందిలో నిందిస్తున్నాడు. రాజశేఖరం తన మార్గం మార్చుకోవాలన్న నిర్ణయానికి వచ్చాడు. డా.సుందరం, అతని మిత్రులు ఇచ్చిన సలహాలను తప్పక పాటిస్తానని వాళ్ళకు మాట ఇచ్చాడు. ఆయన కళ్ళల్లో డాక్టర్‌కి దృఢనిర్ణయం కనిపించింది.

నిర్జీవమైన ఏటికి మళ్ళీ ప్రాణం వస్తుందనీ; స్వచ్ఛమైన గాలికీ, నిర్మలమైన నీటికీ గ్రామ ప్రజలకు ఇబ్బంది ఉండదనీ డాక్టర్ గట్టిగా విశ్వసించాడు. ఆయన కళ్ళు ఆనందంతో మెరిశాయి!

—సుకేశిని

నవ్వుకోవడానికి కాదు !?!





# మూడు ముక్కల మంత్రం

వల్లభాపుర గ్రామానికి అల్లంత దూరంలో వున్న పాతకాలపు చింతతోపులోని,చెట్టుమీద మరుగుజ్జు పిశాచం ఒకటి నివాసం ఏర్పరచుకున్నది. దాని పక్కనేవున్న శ్మశానంలోని పిశాచాలు, ''ఛీఛీ! నువ్వొట్టి అల్లరిపోతువు. నీ ముఖం చూడడమే రోత. మా బోటివాళ్ళ మధ్య వుండతగవు!'' అంటూ సంవత్సరం కిందట తరిమేశాయి.

ఒకనాటి అర్ధరాత్రివేళ,దానికన్నా పొట్టిగా వున్న మరొక మరుగుజ్జు పిశాచం చింత తోపులోకి వచ్చి మరుగుజ్జు పిశాచాన్ని చూసి ఆనందంతో, ''ఇవ్వాళ అమావాస్య, ఆదివారం, ఆపైన అర్ధరాత్రి - ఆహాహా!'' అంటూ,దాని పక్కన చేరి, ''మనిద్దరం కలిసి జట్టుగా వుందాం. నా పేరు పిల్లిపిశాచం, మరి నీ పేరేమిటి?'' అని అడిగింది.

తనకు చక్కని తోడు దొరికినందుకు సంతోషంతో పొంగిపోతూ, ''నా పేరు పెసర పిశాచం! మనిద్దరం కలిశామంటే ఒకటే సందడి. సరేనా!'' అన్నది పెసరపిశాచం. ఆ రోజు మొదలు పిల్లి-పెసర పిశాచాలు రెండూ, దారేపోయే వాళ్ళను నానా అల్లరీ చేయడం ప్రారంభించాయి.

ఇలావుండగా- ఒకరోజు చీకటి పడేవేళ, ఆరు గూడుబళ్ళు అమిత కోలాహలంగా అటుకేసి వచ్చాయి. బళ్ళల్లో ఒంటి నిండా నగలతో, పట్టుచీరలు ధరించిన చాలా మంది ఆడవాళ్ళున్నారు.పిల్లి-పెసర పిశాచాలకు, ఆ బళ్ళల్లో వున్నది పెళ్ళివారని తెలిసిపోయింది.

''మనం వీళ్ళ వెంట గ్రామంలోని పెళ్ళివారింటికి వెళదాం. అక్కడ పెళ్ళివాళ్ళ మధ్య నానాఅల్లరీ, గొడవలూ ప్రారంభించి వినోదిద్దాం,'' అన్నది పిల్లిపిశాచం.

''సరిసరి! నేననుకుంటున్నదే నువ్వు చెప్పావు. పదపద, '' అన్నది పెసరపిశాచం.

ఆ తర్వాత రెండూ కలిసి, బళ్ళతోపాటు పెళ్ళివారిల్లు చేరి, గుట్టుచప్పుడు కాకుండా అక్కడ పట్టెమంచాలు వున్న పెద్ద గదిలోని అటకమీద చేరాయి.

మాచిరాజు కామేశ్వరరావు



''మనం ఈ పెళ్ళిజనాలకు కనిపించ కుండావుంటూ, కొత్త తరహాలో నానా రభసా చేయాలి'', అన్నది పెసరపిశాచం.

''కొత్త తరహాలోనా!'' అంటూ పిల్లి పిశాచం కాసేపు తలగోక్కుని, ''ఆహా, గుర్తొచ్చె, విను! నేను లోగడ తుమ్మల పాలెం దాపులనున్న నీటివాగు దగ్గరి చెట్లల్లో వుంటూండగా, రోజూ నడిరాత్రివేళ ఒక ముసలి పిశాచం వాగు దగ్గరకు వస్తూం డేది. అది కళ్ళు మూసుకుని ఏదో గొణు క్కుంటూ మధ్యమధ్య ఒక దోసెడు నీళ్ళు తాగుతూండేది. నేను ఒకరాత్రి దాని ముందు కూర్చుని, అది కళ్ళు తెరవగానే, ఏదైనా మంత్రం నేర్పమన్నాను. ముసలిది, 'అలాగే! కాని, నువ్వేనాడూ ఇక్కడికి రాకూడదు,' అని,ఒకమూడుముక్కల మంత్రంనేర్పింది,'' అన్నది.

''మరి,ఆ మంత్రాన్ని,ఈ పెళ్ళివాళ్ళ మీద ప్రయోగిద్దామా?''అన్నది పెసరపిశాచం.

''ప్రయోగిద్దాం.నేనుమంత్రం పఠించగానే నువ్వు 'అస్తు' అన్నావంటే,ఎదుటి వాళ్ళు ఏమంటే అది జరిగిపోతుంది,''అన్నది పిల్లి పిశాచం.

అంతలో, ఆ గదిలోకి భోజనాలయ్యాక పెళ్ళికూతురు, ఆమె తల్లి, తండ్రివచ్చారు. పెళ్ళికూతురు పెట్టెలోంచి,ఒకపట్టుచీర తీసి, ''ఇది అమ్మ ముహూర్తం వేళ కట్టుకోబోయే చీర బావుందా, నాన్నా!''అని అడిగింది.

''చీర బాగానేవున్నది. మరి, ఖరీదెంత?'' అన్నాడు పెళ్ళికూతురుతండ్రి.

''వెయ్యిరూపాయిలు, నాన్నా!'' అన్నది పెళ్ళికూతురు.

పెళ్ళికూతురు తండ్రి కోపంగా భార్య కేసి చూస్తూ,'' నీ కడుపుకాలా, అంత ఖరీ దైన చీరకొంటావా?'' అన్నాడు.

ఆ వెంటనే అటకమీద పిల్లిపిశాచం మూడుముక్కల మంత్రం పఠించింది. పెసర పిశాచం,''అస్తు'' అన్నది.

మరుక్షణం,పెళ్ళికూతురుతల్లి,''అయ్యో, మంట!''అంటూ అరిచి,''నోట్లో ఏ శనిగాడిని పెట్టుకుని అన్నావోగానీ, కడుపు కాలిపోతు న్నది. ఛీ, నీ మొహం మండా!'' అన్నది.

పిల్లిపిశాచం మూడు ముక్కలమంత్రం పఠించడం, పెసరపిశాచం, ''అస్తు'' అనడం జరిగిపోయింది. పెళ్ళికూతురు తండ్రి, ముఖాన్ని పైపంచతో తుడుచుకుంటూ, ''మీ అమ్మ ఏవో పిశాచపు మంత్రాలు నేర్చి నట్టున్నది. ముఖం కారం రాసుకున్నట్టు కాలిపోతున్నది,'' అని, ముఖం కడుక్కునేం

దుకు పెరటి బావి దగ్గరకు పరిగెత్తాడు. ఆ సమయంలో, పెళ్ళికొడుకు తన కాబోయే భార్యను చూపేందుకు, తన ప్రాణస్నేహి తుణ్ణి వెంటపెట్టుకువచ్చి, పెళ్ళికూతురి అందానికి తన్మయుడై, వాకిట్లో అలా నిలబడి పోయాడు. పక్కనవున్న స్నేహితుడు, అతడి భుజం తడుతూ, ''లోపలికి పద. నేలకు పాదాలంటుకుపోయినట్టు, అలా నిలబడి పోయావేం?'' అన్నాడు.

అదే క్షణంలో, పిల్లిపిశాచం మూడు ముక్కలమంత్రం చదవడం, పెసరపిశాచం ''అస్తు'' అనడం జరిగింది. దాంతో పెళ్ళి కొడుకు ఎంత గింజుకున్నా ఇటు పాదం అటు కదపలేక పోయాడు.

పెళ్ళికూతురున్న గదిలో, ఈ వింతలూ, విపరీతాలూ జరుగుతున్న సంగతి విని,పెళ్ళి కొచ్చినవాళ్ళు చాలామంది గది ముందు గుమిగూడారు.వాళ్ళతో పాటు అక్కడి కొచ్చిన పెళ్ళికూతురు అవ్వ,ఊతకర్రను నేలకు తాటించి,''కడిగిన ముత్యంలాంటి,నామనమ రాలిపెళ్ళిపైగిట్టని వాళ్ళెవరో మంత్రతంత్రాలు ప్రయోగించినట్టున్నది! ఇన్ని ఉప్పు గళ్ళూ, నాలుగు ఎండుమిరపకాయలూ తెండర్రా!'' అంటూ కేక పెట్టింది.

బంధువుల్లో ఒకరు ఆమె అడిగినవి తెచ్చి ఇచ్చారు. అవ్వ వాటిని అన్నివైపులకూ విసిరి వేస్తూ, ''అల్లరి చిల్లర పనులు చేయడానికి గదిలో చేరిన, గాలిధూళి పిశాచాలన్నీ గాడి దల్లా ఓండ్రపెడుతూ పారిపోవాలి,'' అన్నది.

పెళ్ళివారిపాట్లు చూసి ఆనందం పట్ట లేకుండా వున్న పిల్లిపిశాచం అలవాటుగా మూడుముక్కలమంత్రం పఠించింది. అదే అలవాటులో పెసరపిశాచం 'అస్తు' అనే సింది. అంతే! పిశాచాలు రెండూ గాడిదల రూపంలో అటకమీదినుంచి కిందికి దూకి, ఓండ్రపెడుతూ పెరట్లోకి పరిగెత్తి, గోడదూకి చింతతోపు కేసి పారిపోయినై.

పిశాచాలు పారిపోగానే పెళ్ళికూతురు తల్లీ,తండ్రీ ఎప్పటివాళ్ళలాఅయ్యారు.నేలకు అంటుకుపోయిన పెళ్ళికొడుకు పాదాలకు పట్టువిడుపయింది. అనుకున్న ముహూర్తా నికి ఆ ఇంట పెళ్ళి ఘనంగాజరిగిపోయింది.





# స్థితప్రజ్ఞుడు

శివానందుడనే యోగికి స్థితప్రజ్ఞుడని పేరు. ఎందరో ఆయన వద్దకు వెళ్ళి, తమ సమస్యలకు పరిష్కార మార్గాలు తెలుసుకునేవారు.

ఒకసారి బాగా గాయపడిన యువకుడొకడు, పరుగుపరుగున ఆయన ఆశ్రమానికి వచ్చి, పాదాల మీద పడి శరణు కోరాడు. ఏమి జరిగిందని శివానందుడడిగితే, అతడింకా వణుకుతూనే, "స్వామీ! నేను రత్నగుప్తుడనే వ్యాపారి ఇంట అయిదు సంవత్సరాలుగా ఎంతో నమ్మకంగా పనిచేస్తున్నాను. రాత్రి ఆ ఇంట దొంగతనం జరిగింది. పదివేల వరహాలు పోయాయి. అందులో నూరువరహాలు,నా పక్క బట్టల్లో దొరికాయి.యజమాని నన్ననుమానించి చావ బాదుతూండగా, ఎలాగో తప్పించుకుని ఇక్కడికి వచ్చాను," అన్నాడు.

అంతలో అక్కడికి రత్నగుప్తుడు రానే వచ్చాడు. యువకుణ్ణి మరొకసారి కొట్టబోతున్న ఆయనను శివానందుడు వారించి, "నేరం నిరూపణ కాకుండా, ఈ యువకుణ్ణి శిక్షించావు. ముందు నువ్వతడికి క్షమాపణ చెప్పుకో," అన్నాడు.

రత్నగుప్తుడికి పట్టరాని కోపం వచ్చింది. "ఏ పనీ చేయకుండా కూర్చుని తింటూ కండలు పెంచిన నీవంటి వారెన్నయినా శుష్క వేదాంతాలు చెబుతారు. వీడు నా ఇంట్లో దొంగతనం చేశాడని, నాకు ఖచ్చితంగా తెలుసు. కాదని నువ్వంటే- అసలు దొంగ ఎవరో చెప్పి, నా పదివేల వరహాలూ నాకు అప్పచెప్పు. నేను వీడిని క్షమాపణ అడుగుతాను," అన్నాడు.

అంతవరకూ శివానందుడితో అంత పౌరుషంగా మాట్లాడినవారు లేరు. ఆయన ఎలాగైనా రత్నగుప్తుడికి బుద్ధి చెప్పాలనుకుని వెంటనే కళ్ళు మూసుకుని, అసలు దొంగ కోసం యోగదృష్టితో వెదికాడు. ఎందువల్లనో ఆయనకు అంతా చీకటే తప్ప ఏమీ కనబడలేదు. అలా ఎందుకు జరిగిందో, తన శక్తు

"వసుంధర"

లెందుకు పని చేయలేదో అర్థంకాక, అప్పటి కేమీ చెప్పలేక రత్నగుప్తుడితో, ''దొంగ ఎవరో నాకు తెలిసింది. రెండు రోజులు వ్యవధి ఇస్తే ఆ మనిషినీ, డబ్బునూ కూడా నీకు అప్ప జెబుతాను,'' అన్నాడు.

ఆ మాటలకు రత్నగుప్తుడు కాస్త తడ బడినా, అంతా జరిగినప్పటి మాట కదా అని, బింకంగానే తిరిగివెళ్ళాడు.

శివానందుడు, యువకుడి వంక చూసి, అసలీ దొంగతనం ఎవరు చేసివుంటారో చెప్ప గలడేమోనని అడిగాడు. యువకుడు తట పటాయిస్తూ, ''స్వామీ! ఇది బయటి వారి పనికాదు. ఇంటిదొంగల పని. మా యజ మాని బావమరిది ఆ ఇంట్లోనే వుంటున్నాడు. వ్యసనపరుడు కావడంవల్ల, ఆయన డబ్బు బాగా ఖర్చు చేస్తాడు. భర్తకు తెలియకుండా అక్క అతడికి రహస్యంగా డబ్బులిస్తూం టుంది. ఇప్పుడాయనకు పెద్ద మొత్తంలో డబ్బుకావలసివచ్చి వుంటుందని, నానమ్మకం. నూరు వరహాల మూటలు నూరింటిని దొంగి లించి, అనుమానం తన మీదకు రాకుండా, నా పక్క బట్టల్లో ఒక మూట దాచి వెళ్ళి వుంటాడు. నా అనుమానానికి రుజువులు లేవుకాబట్టి, ఈ మాటను పైకి అంటే, యజ మాని నాప్రాణాలుతీసేస్తాడు,'' అనిచెప్పాడు.

వాడి పరిస్థితికి జాలిపడిన శివానందుడు, ''నువ్వు ఆశ్రమంలోనేవుండి గాయాలకు మందు వేసుకుని విశ్రాంతి తీసుకో. నేను ఊళ్ళోకివెళ్ళి విషయం విచారించివస్తాను,'' అంటూ అక్కణ్ణించి బయలుదేరాడు.

ఆయన కొంత దూరం వెళ్ళాక, ఒక చెట్టు చాటుకుపోయి, ''నా రూపం పూర్తిగా మారి



పోవాలి!'' అనుకుంటూ కళ్ళు మూసు కున్నాడు. ఆయన తిరిగి కళ్ళు తెరిచే సరికి ఒంటికున్న దుస్తులు మారిపోయాయి. ఆజానుబాహుడిగావుండే ఆయన పొట్టిగా, లావుగా, చిరుబొజ్జతో వున్నాడు.

''నా శక్తులు తిరిగి పనిచేస్తున్నట్టు న్నాయి!'' అనుకుంటూ, ఆయన మళ్ళీ కళ్ళు మూసుకుని రత్నగుప్తుడి ఇంట దొంగ తనం గురించి శోధించాడు. కానీ అంతా చీకటి తప్ప ఇంకేమీ కనబడలేదు.

''చిత్రంగావుంది!'' అనుకుంటూ శివా నందుడు ఊళ్ళోకి వెళ్ళాడు. విచారించగా ఆయనకు, రత్నగుప్తుడి బావమరిది వ్యసన పరుడన్న విషయం రూఢి అయింది. అతడు తరుచుగా లింగయ్య అనే అతడి ఇంటికి వెళుతూంటాడని తెలిసి, శివానందుడు అక్క డికి వెళ్ళాడు.



ఆ సమయంలో లింగయ్య తన ఇంటి అరుగు మీద కూర్చునివున్నాడు. అతడు శివా నందుణ్ణి చూస్తూనే రెండు చేతులూ జోడించి నమస్కరించి, "రండి, స్వామీ! తమ వంటి యోగులు మా ఇంటికి రావడం మా అదృష్టం," అన్నాడు.

శివానందుడు కలవరపడి తనను చూసు కుంటే, రూపం పొట్టిగా, లావుగా, చిరుబొజ్జ తోనే వున్నది. లింగయ్య అలా ఎందుకన్నాడో తెలియక, "నేను యోగినేమిటి, నా మొహం!" అంటూ వెళ్ళి ఆయన పక్కన కూర్చున్నాడు. "ఏమో, మిమ్మల్ని చూడగానే అలా అనిపించింది," అన్నాడు లింగయ్య.

అంతలో అక్కడికి బుర్రమీసాల వ్యక్తి ఒకడు వచ్చాడు. ఆరడుగుల ఎత్తున్న అతడు లింగయ్య వంక గుడ్లురిమి చూస్తూ "ఇవిగో, నీ వెయ్యి వరహాలూ తిరిగి తీసుకో. నువ్వు నాకీ డబ్బిచ్చి సాయం చేసినందుకు, నీ పెళ్ళాం నన్ను నానామాటలూ అంటున్న దట! నీ అంత కుళ్ళుబోతునూ, స్వార్థపరుణ్ణీ నేనెక్కడా చూడలేదు. అసలు నీలాంటివాడికి బాకీ తీర్చడమే తెలివి తక్కువ. నాడబ్బు నేను తీసుకు వెళుతున్నాను. ఏం చేస్తావో చేసుకో!" అంటూ, లింగయ్య పక్కనున్న వరహాల మూటను తీసుకుని వెళ్ళిపోయాడు. లింగయ్య ఏమీ అనలేదు.

ఇదంతా చూసిన శివానందుడు, "అత డన్ని మాటలంటూంటే, మీరొక్క మాట అన లేదు. అవసరం తనదే అయినప్పటికీ అత డలా ప్రవర్తించడం, మీరు సహించడం నాకు చాలా ఆశ్చర్యంగావుంది!" అన్నాడు.

"నాగురించి అంతా ఇలాగే అంటారు. నాలో ఏదో లోపముందనీ, పదిమందీ నన్ను గౌరవంగా చూసే నడవడిక అలవర్చుకునేం దుకు శివానంద యోగిని దర్శించమనీ చాలా మంది నాకు సలహా ఇచ్చారు. సంసార సాగ రంలో కొట్టుమిట్టాడుతున్న నా కంత వ్యవధి ఎక్కడిది? తమరిని చూడగానే, నాకు శివా నందుడే మా ఇంటికి వచ్చినట్టనిపించింది. నన్ను స్థితప్రజ్ఞుడిగా చేయగల సామర్థ్యం, మీకున్నదనిపిస్తున్నది. ఈ రోజుకు మా ఇంట్లో వుండి, నాప్రవర్తన సరిదిద్దుకునే మార్గం చెప్పండి," అన్నాడు లింగయ్య.

శివానందుడా ఇంట్లో ఒకరోజంతా ఉన్నాడు. లింగయ్య ప్రవర్తన ఆయనకు చాలా ఆశ్చర్యం కలిగించింది.

భార్య, లింగయ్యను కూర ఏం చేయ మంటావని అడిగింది. లింగయ్య వంకాయ కూర చెయ్యమన్నాడు. నీకెప్పుడూ వంకాయ

కూరే అంటూ విసుక్కుని, సొరకాయకూర వండింది. కొడుకు వచ్చి, తనకు చదువు పట్ల ఆసక్తి లేదనీ, వ్యవసాయం చేయాలని వున్నదనీ అన్నాడు. మంచిది, అలాగే చేయమన్నాడు లింగయ్య. అంతలో భార్య కల్పించుకుని, "నువ్వు పిడిరాయిలావుండగా, ఈ వయసులో వాడికెందుకు వ్యవసాయం? నేను చెప్పినట్టు, వాణ్ణి బుద్ధిగా చదువుకోమను," అన్నది.

లింగయ్య, కొడుకును తల్లి చెప్పినట్టే చెయ్యమన్నాడు.

శివానందుడికి లింగయ్య ఏమాత్రం చేవ లేనివాడని అర్థమైంది.లింగయ్య తన ఆలోచనలకు పని చెప్పకుండా, గంగిరెద్దులా అన్నిటికీ తలూపడం శివానందుడికి నచ్చలేదు. మనిషికి గౌరవం లభించాలంటే వ్యక్తిత్వముండాలని, ఆయన లింగయ్యకు చెప్పాలనుకుంటూండగా, ఒక మనిషి వచ్చాడు. ఆయన రత్నగుప్తుడి బావమరిది. తన దగ్గరున్న అయిదువేల వరహాలను, లింగయ్య దగ్గర దాచుకునేందుకు వచ్చాడు.

"నీ బుద్ధి మారలేదు. మళ్ళీ దొంగతనమెందుకు చేశావు?" అన్నాడు లింగయ్య.

"నేను దొంగతనం చేస్తూంటే నువ్వు చూశావా? నేను డబ్బు దాచమంటే దాచడం వరకే,నీవంతు. అంతకు మించి మాట్లాడితే మర్యాద దక్కదు," అన్నాడు రత్నగుప్తుడి బావమరిది.

ఈసారి లింగయ్య కోపం తెచ్చుకుని, "నే చెప్పేది శ్రద్ధగా విను! భక్తి వున్నవాడు దణ్ణం పెట్టాడని, దేవుడి విగ్రహాన్ని రాయికాదనలేము. నాస్తికుడు తిట్టాడని రాతివిగ్రహం



దేవుడు కాకుండాపోదు. మనకు లభించే గౌరవం మన గొప్పతనం వల్ల కాక, ఇతరుల అభిరుచీ, లోకజ్ఞతను బట్టి వస్తుంది. ఎదుటివారిని నొప్పించకుండా మన కిష్టమైన మంచి పనులు చేస్తూన్నంతకాలం, మనం గౌరవం గురించి పట్టించుకోనక్కరలేదు. నీ డబ్బు నేను దాస్తాను. కానీ నువ్వు నిన్న రాత్రి రత్నగుప్తుడి ఇనప్పెట్టెలోంచి వంద వరహాల మూటలు దొంగిలించి, అనుమానం పని వాడి మీదికి పోయేలా ఒక మూటను వాడి పక్క బట్టల్లోవుంచావు. నీ పాత బాకీలు తీర్చగా కొంత అవసరానికుంచుకుని, మిగతా అయిదువేల వరహాలూ నాదగ్గర దాస్తున్నావు. ఈ నేరం నిన్ను కారాగారం పాలుచేస్తే, నేను బాధ్యుణ్ణికాను, వెళ్ళు!" అన్నాడు.

రత్నగుప్తుడి బావమరిది అక్కణ్ణించి నిర్లక్ష్యంగా వెళ్ళాడు. అప్పుడు శివానందుడు

ఆశ్చర్యంగా, ''అతడు దొంగతనం చేశాడని మీకెలా తెలుసు?'' అని అడిగాడు.

''ఏమో! అతణ్ణి చూడగానే నాకది స్ఫురించింది. నిజానికి మిమ్మల్ని చూడగానే నాకు, తమరు శివానందయోగులనీ, ఈ దొంగను పట్టుకునేందుకే నాదగ్గరకు వచ్చారనీ అనిపించింది. మీరు కోరితే, ఈ విషయంలో నేను మీకు సాక్ష్యంగా వుండడానికి అభ్యంతరం లేదు,'' అన్నాడు లింగయ్య.

శివానందుడు చప్పున అతడికి నమస్కరించి, ''మిమ్మల్ని సరిగా అర్థం చేసుకునేందుకు, నేను చాలా సమయం వృధా చేశాను. నన్ను తమరు శివానందుడిగా గుర్తించినప్పుడే, అసలు నిసలు స్థిరప్రజ్ఞులు మీరని గుర్తించవలసింది. సంసారసాగరాన్నీదుతూ కూడా రాగద్వేషాలకూ, దూషణభూషణలకూ, అహానికీ, భావోద్వేగానికీ దూరంగావున్న మీవద్ద, నేను స్థితప్రజ్ఞతను అలవరచుకునే మార్గం అభ్యసించాలి!'' అన్నాడు.

ఈ మాటలకు లింగయ్య తల అడ్డంగా ఊపి, ''సామాన్య జీవితం గడిపే నేనెక్కడ? సమస్త సుఖాలనూ త్యాగం చేసి యోగ సాధనలో వున్న మీ రెక్కడ? రత్నగుప్తుడు మిమ్మల్ని నానామాటలూ అన్నాడని ఉక్రోషం వచ్చి, ఒక నిరపరాధి దారుణ శిక్షకు గురయ్యాడన్న మనోవ్యధ వల్లనూ— తాత్కాలికంగా, ఆ శక్తులను కోల్పోయారు తప్పితే, మీరు సామాన్యులుకారు!'' అన్నాడు.

అప్పుడు శివానందుడు, ''స్వామీ! ఇప్పుడు నాకు జ్ఞానోదయమయింది. స్థితప్రజ్ఞకు యోగసాధనే అవసరంలేదు. ఇంత కాలంగా, పదిమందిలో యోగిగా గుర్తింపు పొందాలన్న తపన నాకుండిపోయింది. అందువల్లనే నేను స్థితప్రజ్ఞుణ్ణి కాలేకపోయాను,'' అంటూ ఆయనకు పాదాభివందనం చేశాడు.

తర్వాత శివానందుడు, లింగయ్య సాయంతో రత్నగుప్తుడికి అసలు నేరస్థుణ్ణి పట్టిచ్చాడు. బావమరిది అని కూడా చూడకుండా రత్నగుప్తుడు, నేరస్థుణ్ణి కారాగారం పాలుచేశాడు. శివానందుడు కోరినట్లుగా అతడు తన పనివాడికి క్షమాపణలూ చెప్పుకున్నాడు. ఆతర్వాత శివానందుడు యోగాశ్రమాన్ని విడిచి పెట్టి, గుర్తింపులేని స్థితప్రజ్ఞుడిగా ఎందరికో మేలు చేశాడు.



65. యాదవ నాశనం

# మహాభారతం

మర్నాడే సాంబుడికి ముసలం పుట్టింది. ఆ ముసలాన్ని చూర్ణం చేసి, ఆ చూర్ణాన్ని సముద్రంలో పారేయించమని కృష్ణుడు ఉత్తరు విచ్చాడు. తరవాత అతను ఎవరూ మద్యం తాగరాదనీ, తాగిన వాళ్ళను కొరత వేయిస్తాననీ ప్రకటన చేశాడు.

వృష్ణి అంధకులు ఎంత జాగ్రత్తగా ఉన్నప్పటికీ, దుశ్శకునాలు కనిపించాయి. ఎక్కడ చూసినా ఎలుకలు చెలరేగాయి. యాదవుల లోనే అవలక్షణాలు తల ఎత్తాయి. పెద్దలంటే ఆదరం పోయింది. భార్యాభర్తలు పరస్పరం తిట్టుకోసాగారు. భోజనంలో పురుగులు కనిపించసాగాయి. ఇలాంటి శకునాలే భారత యుద్ధం జరగబోయే ముందు కూడా కనిపించి, ప్రజాక్షయం సూచించాయి. ఇది గుర్తు తెచ్చుకుని కృష్ణుడు, యాదవుల నందరినీ సముద్రతీరానికి తీర్థయాత్రకు బయలుదేర దీశాడు.

తీర్థయాత్రకు సన్నాహాలు జరిగాయి. పెద్ద ఎత్తున మద్యమాంసాలు తయారు చేశారు. ఏనుగుల మీదా, గుర్రాలమీదా, రథాలమీదా యాదవులు, సకుటుంబంగా బయలుదేరి, సముద్ర తీరానికి వచ్చి చేరి, అక్కడ విడుదులు ఏర్పాటు చేసుకున్నారు. అక్కడికి ప్రభాసతీర్థం సమీపంలోనే ఉన్నది.





వృష్ణి వంశం వాడూ, కృష్ణుడికి ఆప్తుడూ అయిన ఉద్ధవుడు యాదవ వీరులను సముద్రం ఒడ్డుకు తీసుకుపోయాడు. అక్కడ వాళ్ళు ఆకాశం బద్దలయేటట్టు ఆర్భాటంచేస్తూ తాగటంప్రారంభించారు.కృష్ణ బలరాములతోసహా అందరూ తెగ తాగారు.

తాగిన ఆవేశంలో యుయుధాముడు కృతవర్మతో, "నిద్రపోతున్న ఉప పాండవులను చంపడంలో నీ పాత్ర ఉందిగదా. యాదవు డైనవాడుఎన్నడూ అలాచేయడు," అన్నాడు. మాట మీద మాట పెరిగింది. యాదవులు తాము తాగే పాత్రలతో ఒకరినొకరు కొట్టుకో సాగారు. వంశ కలహం ప్రారంభమయింది. ప్రద్యుమ్నుడు భోజుల మీదికి వెళ్ళాడు. భోజులు సాత్యకినీ, ప్రద్యుమ్నుణ్ణీ చంపారు. కృష్ణుడికి కోపం వచ్చింది. అతను ఇంత గడ్డి పీకి దానితోనే అనేక మందిని చంపాడు. ఆ గడ్డి ముసలం లాగా పని చేసింది. అందరూ ఆ గడ్డినే పీకి ఒకరి నొకరు చంపుకున్నారు. ఈ కొట్టుకోవటంలో ఒక క్రమం కూడా లేకుండా పోయింది. తండ్రి కొడుకునూ, కొడుకు తండ్రినీ కూడా కర్కశంగా చంపు కోవటం జరిగింది.

తన కొడుకులూ, మనమలూ చావటం చూసి కృష్ణుడు, ప్రాణాలతో మిగిలి ఉన్న వారినందరినీ చంపేశాడు. అప్పుడు కృష్ణుడి సారథి అయిన దారుకుడూ, బభ్రువు అనే వాడూ కృష్ణుడితో, "అందరూ చచ్చారు. మనం ఇక్కడెందుకు; పోయి బలరాముణ్ణి వెతుకు దాం," అన్నారు.

ఆ ముగ్గురూ వెతుకుతూ పోగా, వారికి బలరాముడు ఒక చెట్టు కింద కనిపించాడు. కృష్ణుడు దారుకుడితో, "నువ్వు వెంటనే హస్తినాపురానికి పోయి యాదవులంతా

మునుల శాపం తగిలి చచ్చారని అక్కడి వారికి చెప్పు. అర్జునుడు ద్వారకకు తప్పక వస్తాడు,'' అన్నాడు.

దారుకుడు రథం మీద బయలుదేరాడు. కృష్ణుడు బభ్రువుతో, ''నువ్వు ఆడవాళ్ళను కాపాడు. బంగారం కోసం దొంగలు వాళ్ళను ఎత్తుకుపోవచ్చు,'' అన్నాడు. కాని బభ్రువు కూడా కృష్ణుడు చూస్తూండగానే, ఒక బోయ వాడు వదిలిన బాణం తగిలి చచ్చాడు.అందు చేత కృష్ణుడు బలరాముడితో, 'నేను ఆడ వాళ్ళను ద్వారకలో చేర్చి వస్తాను. నువ్వు ఇక్కడే ఉండు,''అని స్త్రీలను వెంటబెట్టుకుని వెళ్ళి తన తండ్రికి అప్పగించి, ''నేను ఈ నగరంలో ఉండలేను. బలరాముడూ, నేనూ తపస్సు చేసుకుంటాం,''అని తండ్రికి నమస్కా రంచేసి, బలరాముడి వద్దకు తిరిగి వచ్చాడు.

బలరాముడు నిర్జన ప్రాంతంలో యోగ సమాధిలో ఉన్నాడు. కృష్ణుడు చూస్తూండ గానే ఒక తెల్లని సర్పం బలరాముడి ముఖం నుంచి వచ్చి, సముద్రంలో ప్రవేశించింది. ఆ మహాసర్పానికి స్వాగతం చెప్పటానికి వరు ణుడూ, ఇతర సర్పాలూ భక్తితో ఎదురు వచ్చాయి.

తరవాత కృష్ణుడు దారీ తెన్నూ లేకుండా తెగ తిరిగి, ఒక చోట పడుకున్నాడు. ఇంతలో జరుడు అనే బోయవాడు వేటాడుతూ అటుగా వచ్చి, కృష్ణుణ్ణి దూరం నుంచి చూసి ఏదో మృగమనుకుని, కృష్ణుడి పాదాన్ని బాణంతో కొట్టాడు. అప్పుడు కృష్ణుడు తన శరీరాన్ని విడిచిపెట్టి, తన తేజస్సుతో భూమ్యా కాశాలు నిండగా ఆకాశంలోకివెళ్ళిపోయాడు. ఇంద్రుడూ, సమస్తదేవతలూ అతనికి ఎదురు వచ్చి తీసుకుపోయారు.

కృష్ణుడు పంపిన దారుకుడు కురుదేశాలు చేరి, పాండవులను కలుసుకుని, యాదవ వంశాలు నాశనమైన సంగతి చెప్పాడు.





పాండవులు అది విని మహా దుఃఖించారు. అర్జునుడు దారుకుడి వెంట ద్వారకకు వెళ్ళి, అనాథలైన యాదవ స్త్రీలను చూశాడు.వాళ్ళు అర్జునుణ్ణి చూసి గొల్లున ఏడ్చారు. ఆ స్థితిలో వాళ్ళను అర్జునుడు చూడలేకపోయాడు. అతడిమనసు చెప్పలేనంతగా కలత చెందింది. అర్జునుడు సత్యభామనూ, రుక్మిణినీ ఊరడించి, అక్కడినుంచి వసుదేవుడి వద్దకు వెళ్ళాడు.

వసుదేవుడు అర్జునుణ్ణి కౌగలించుకుని, ''నాయనా, మేటి రాక్షసులను చంపిన నా కొడుకులు పోయారు. నేనింకా జీవించే ఉన్నాను. నీ శిష్యులైన ప్రద్యుమ్నుడూ, సాత్యకీ మూలంగా యాదవవంశం నాశనమయింది. ఎవరినీ తప్పు పట్టే పనిలేదు. మునుల శాపం తగిలింది. కృష్ణుడు ఉపేక్షించాడు. నువ్వు వస్తావనీ; నువ్వు చెప్పినట్టు చెయ్యమనీ కృష్ణుడు నాతో చెప్పి వెళ్ళాడు,'' అన్నాడు.

తరవాత అర్జునుడు దారుకుడి వెంట యాదవ సభకు వెళ్ళి, మంత్రులతో, ''ద్వారక సముద్రంలో మునిగిపోతుంది. నేను అందరినీ ఇంద్రప్రస్థానికి తీసుకుపోతాను. వాహనాలు సిద్ధం చెయ్యండి. ధనరాసులు పోగు చెయ్యండి. మీకు రాజు కాబోయే వజ్రుడు ఇంద్రప్రస్థంలోఉంటాడు.అందరూ ప్రయాణ సన్నాహం చెయ్యండి. ఆలస్యం వద్దు,'' అని చెప్పాడు.

ఆ మర్నాడే వసుదేవుడు యోగ సమాధిలోకి పోయి, ప్రాణాలు వదిలాడు. వసుదేవుడి భార్యలు దేవకీ, రోహిణీ, భద్రా, మదిరా ఆయనతో సహగమనం చేశారు. వసుదేవుడికి ఇష్టమైన ప్రదేశంలోనే ఆయనను దహనం చేశారు. తరవాత వజ్రుడు మొదలైన వృష్ణి, అంధక కుమారులు జలతర్పణాలు విడిచారు.

తరవాత అర్జునుడు యాదవులందరూ చచ్చిపోయిన చోటికి వెళ్ళి, వారికి ఉత్తర క్రియలు చేశాడు. ఏడవ రోజున అతను ప్రయాణమయ్యాడు. స్త్రీలూ, చావగా మిగిలిన వారూ అతని వెంట బయలుదేరారు. రథాల మీదా, ఏనుగుల మీదా, కాలి నడకనా వీరంతా పోతూ ఉంటే వీరి వెనకగా సముద్రం ద్వారకను ముంచుతూ వచ్చింది.

అర్జునుడు అక్కడక్కడా మజిలీలు చేస్తూ పంచనదం చేరాడు. అంతమంది నిస్సహాయులైన ఆడవాళ్ళు వెంట అర్జునుడు ఒక్కడే యోధుడు ఉండటం చూసి కొందరు దొంగలు కర్రలు తీసుకుని, రాళ్ళు రువ్వుతూ

ఆడవాళ్ళపైన పడ్డారు. అర్జునుడు వాళ్ళను భయపెట్టాడు. కాని వాళ్ళు అతని మాటలు లక్ష్య పెట్టలేదు. అర్జునుడు తన గాండీవాన్ని ఎక్కు పెట్టటమే ఎంతో కష్టమయింది. తరవాత అత నికి అస్త్రాలేవీ జ్ఞాపకం రాలేదు. అతను దొంగలను ఏమీచెయ్యలేక సిగ్గుపడవలసి వచ్చింది. అతను చూస్తూండగానే దొంగలు యాదవ స్త్రీలను నాలుగు దిక్కులకూ తీసుకుపోయారు. దొంగలు ఎత్తుకుపోగా మిగిలిన స్త్రీలనూ, ధనాన్నీ తీసుకుని అర్జునుడు కురుక్షేత్రం ప్రవేశించాడు.

ధర్మరాజు నిర్ణయించిన మీదట కృతవర్మ భార్యనూ, కొడుకునూ మార్తికావతంలోనూ, చిన్న పిల్లలనూ,స్త్రీలనూ,ముసలివాళ్ళనూ, ఇంద్రప్రస్థంలోనూ, సాత్యకి కొడుకును సర స్వతిలోనూ ఉంచి వజ్రుణ్ణి ఇంద్రప్రస్థానికి రాజుగా చేశారు.అక్రూరుడి భార్యలను వజ్రుడి రక్షణలో ఉంచారు.

కృష్ణుడి భార్యలలో రుక్మిణి మొదలైన వారు అగ్నిప్రవేశం చేయగా సత్యభామ మొద లైనవారు అడవికి వెళ్ళి తపస్సు చేసు కున్నారు.

తరవాత అర్జునుడు వ్యాసుడి ఆశ్రమానికి వెళ్ళాడు.

అతన్ని చూడగానే వ్యాసుడు, "అర్జునా, ఇంత దీనంగా కనబడుతున్నావు, ఏం జరి గింది?" అని అడిగాడు.

దానికి అర్జునుడు, "మహాత్మా, నాకు విచారం ఎందుకు ఉండదు? కృష్ణుడూ, బలరాముడూ చనిపోయారు. మునుల శాపం తగిలి యాదవులందరూ నశించారు. ఎలాటి శస్త్రాల దెబ్బలకైనా తట్టుకోగల మహావీరులు తుంగగడ్డితో కొట్టుకుని చచ్చి పోయారు. ఇదంతా నాకు చాలా బాధ కలిగిం చింది. కృష్ణుడు లేని ఈ లోకంలో నేను ఎలా ఉంటానో తెలియటం లేదు. ఇది ఇలా



ఉండగా ఇంతకన్న దారుణం జరిగింది. నా పరాక్రమం అంతా పోయింది. దొంగలు యాదవ స్త్రీలను ఎత్తుకుపోతూ వుంటే నేను అక్కడేవుండీ వాళ్ళను వారించలేకపోయాను. నా మనసు వికలంగా ఉన్నది. శాంతి కల గటంలేదు. నేను కాలుకాలిన పిల్లిలాగా తిరుగుతున్నాను. నేను ఏం చెయ్యాలి?'' అని అడిగాడు.

''అర్జునా, వృష్ణి, అంధకులు శాపం తగిలి నశించారు. వారి కోసం విచారించకు. కృష్ణుడు దాన్ని ఆపగలిగి ఉండి కూడా చూస్తూ ఊరుకున్నాడు. శాపం తప్పించటం అతనికి మాత్రం సాధ్యమా? కృష్ణుడు అవతరించినపని పూర్తి అయింది. అతను తన స్వస్థానానికి వెళ్ళిపోయాడు. నువ్వు కూడా భీమనకుల సహదేవులతో కలిసి అనేక మహత్కార్యాలు చేశావు. మీరు కృతార్థులైనారనే నా నమ్మకం.మీరు కూడా త్వరలోనే ఉత్తమగతికి పోతారు. కాలం మారుతూ,అన్నిటినీ మార్చుతుంది.ప్రపంచమే కాలానికి అధీనమై ఉన్నది. కాలం ఒకప్పుడు మనని శాసిస్తుంది, మరొకప్పుడు మనం చెప్పినట్టు వింటుంది. నీ అస్త్రాలకు పని తీరిపోయింది. అవి అందువల్ల నీ నుంచి పోయాయి,'' అన్నాడు వ్యాసుడు.

అర్జునుడు హస్తినాపురానికి తిరిగి వెళ్ళి, ధర్మరాజుతో తాను ద్వారకలో చేసినదంతా చెప్పాడు.

అంతా విన్న మీదట ధర్మరాజుకు మహాప్రస్థానం చెయ్యాలన్న ఆలోచన కలిగింది. ఆయన అర్జునుడితో, ''తమ్ముడా, కాలం అన్ని ప్రాణులను బంధిస్తుంది,'' అన్నాడు.

పాండవులందరికీ రాజ్యత్యాగం చేసి, మహాప్రస్థానం పోవాలన్న కోరిక కలిగింది. ధర్మరాజు యుయుత్సుణ్ణి పిలిచి అతనికి రాజ్యం ఇచ్చాడు. తన రాజ్యానికి పరీక్షిత్తును రాజుగా చేశాడు. హస్తినాపురానికి పరీక్షిత్తూ, ఇంద్రప్రస్థానికి వజ్రుడూ రాజుగా ఉండేటట్టు ఏర్పాటు జరిగింది. ఇద్దరినీ కనిపెట్టుకుని ఉండమని ధర్మరాజు సుభద్రకు చెప్పి, ద్వారకలో చనిపోయిన కృష్ణుడూ, బలరాముడూ, వసుదేవుడూ, సాత్యకీ, ప్రద్యుమ్నుడూ మొదలైన వారికందరికీ శాస్త్రోక్తంగా శ్రాద్ధక్రియలు జరిపాడు.



ఇదొక చందమామ కానుక!

# అజేయుడు గరుడుడు!

5

చిత్రాలు:పాణి

ఆదిత్యుడు బందిపోటు దొంగలను ఉపాయంతో పట్టుకుని చెరసాలలో పెట్టాడు. గరుడుడు సేనాధిపతి కొడుకు రవీంద్రుణ్ణి అపహరించి, చెరసాలలో ఉన్న బందిపోటు దొంగలను వదిలిపెడితే తప్ప, రవీంద్రుణ్ణి ప్రాణాలతో విడిచి పెట్టనని లేఖ ద్వారా రాజును హెచ్చరించాడు. బందిపోటు దొంగలు విడుదల చేయబడ్డారు. ఆ రోజు రాత్రి బందిపోటు దొంగల నాయకుడు వీరబాహు అడవిలో ముసుగు వీరుడుగా ఉన్న గరుడుణ్ణి కలుసుకుని సేనాధిపతీ అతని కొడుకూ చేసిన దురాగతాలను వివరించాడు.

తన పేరు వినగానే వీరబాహు వెనక్కు తిరిగి తన కేసి చిన్నగా నవ్వుతూన్న వీరుణ్ణి చూసి అమితాశ్చర్యం చెందాడు.












వీరబాహు గుహలో ఉన్న తన సహచరుల దగ్గరికి వెళ్ళాక, ఆదిత్యుడు ముఖానికి మళ్ళీ ముసుగు తొడుక్కున్నాడు.


వీరబాహూ, అతడి అనుచరులూ వచ్చేంత వరకూ ఆదిత్యుడు అక్కడే నిలబడ్డాడు.


''సేనాధిపతిని శిక్షించడమే మన లక్ష్యం. అయినా, తొందరపాటు తగదు. ఆచి తూచి అడుగు వేయాలి. నేను చెప్పేవరకు వేచి ఉండండి!''


రాజధానిలో సేనాధిపతి నరేంద్రుడు డంబాలు పలుకు తున్నాడు.
''మారు వేషంలో తప్పించుకు తిరుగు తూన్న ఆ దుర్మార్గుడు మన రవీంద్రుడి కంట బడ లేదు.''


''కనబడితే ఆ క్షణమే యమలోకానికి పంపే వాడు కదా! మన రవీంద్రుణ్ణి తక్కువగా అంచనా వేయకండి ప్రభూ!''


రాజసభలో....
''వాణ్ణి నేను పట్టకుని రాజభవనం ముందున్న పతాక స్తంభానికి కట్టి పడేస్తాను!''


''అదీ వీరుడి లక్షణం! ఇప్పుడే వెళ్ళి వాణ్ణి పట్టి బంధించు మరి!''


రవీంద్రుడు కొంత మంది సైనికులను వెంట బెట్టుకుని వీరావేశంతో బయలుదేరాడు.


మరునాడు...రాజభవన కాపలా భటుల నాయకుడు రాజు సమక్షానికి వచ్చాడు.
"మహాప్రభూ! రవీంద్ర దేవుడు మనుషులను బళ్ళలో బంధించి తెస్తున్నాడు. ఇప్పుడే వాళ్ళు నగరంలో ప్రవేశించారు."
"వాళ్ళెవరో వెళ్ళి చూద్దాం!"


రాజు భవనంపైకి వెళ్ళి వెలుపలికి చూశాడు. వరసగా గాడిదలు పూన్చిన బళ్ళు! బళ్ళల్లో బంధించబడిన మనుషులు!
"ఆహా! రవీంద్రుడు చెప్పినంతా చేశాడు! నిజంగానే మహా ఘటికుడు!"


"అవును, ప్రభూ! వాడు నా కుమారుడు కదా?"


అంతలో ఆదిత్యుడు కూడా అక్కడికి వచ్చాడు.
"ప్రభూ! ఆ బళ్ళల్లో ఉన్న వాళ్ళందరూ రవీంద్రుడి వెంట వెళ్ళిన మన సైనికులే!"


"రవీంద్రు డెక్కడ?"


మరునాడు ఉదయం... పతాక స్తంభానికి ఎవరో బంధించబడి ఉన్నట్టు, రాజుకూ, సేనాధిపతికీ కబురు వచ్చింది. ఇద్దరూ హుటాహుటిగా అక్కడికి చేరారు. అంతలోనే అక్కడ జనం గుమిగూడి ఉన్నారు. రవీంద్రుడు పతాక స్తంభానికి తాళ్ళతో బంధించబడి ఉన్నాడు. భటులు కట్లు విప్పి అతన్ని కిందికి దించారు.




''రవీంద్రుడికి మాత్రమే కాదు. డంబాలు పలికే ప్రతి ఒక్కరికీ ఇది ఒక హెచ్చరిక!''


''దీనిని ఏమాత్రం సహించకూడదు, ప్రభూ! ఈ దుష్కృత్యానికి పాల్పడ్డ దుర్మార్గుణ్ణి కఠినంగా శిక్షించాలి.''


రాజు ఆగ్రహంతో ఊగిపోయాడు.
''నరేంద్రా! గరుడుణ్ణి తీవ్రవాదిగా ప్రకటించు!''
''వాణ్ణి ప్రాణాలతోగాని, మృతుడుగా గానీ పట్టుకున్నవారికి గొప్ప బహుమతి ఇవ్వగలం!''


సేనాధిపతి దళనాయకులను పిలిపించి, గరుడుణ్ణి పట్టుకునే పథకాలను గురించి తీవ్రంగా చర్చలు జరిపాడు.
''ఇక ఏమాత్రం జాప్యం చేయకూడదు!''


రాజ్యంలోని మారుమూల ప్రాంతాలను సైతం స్పష్టంగా చూపే, దేశపటాలను పరిశీలించాడు. ఒక్కొక్క దళనాయకుడికి ఒక్కొక్క ప్రాంతం కేటాయించి—తీవ్రంగా గాలింపు చర్యలకు దిగమని ఆజ్ఞాపించాడు.
''దశ దిశలకూ మీ బృందాలను పంపండి. మీ సత్తా ఏమిటో నిరూపించండి. గరుడుణ్ణి మీరు ఎప్పుడు, ఎక్కడ, ఎలా పట్టుకుంటారో నాకు అనవసరం! ఆ దుర్మార్గుడు త్వరలో నా ముందు ఉండాలి!''
— ఇంకావుంది



# వీరాగ్రేసరుడు!

ధరణికోటలో ఒక కులీనుడూ, మహాధని కుడూ అయిన క్షత్రియుడుండేవాడు. ఆయన పేరు శూరవర్మ. ఆయనకు ఒక చక్కని కుమార్తె ఉండేది. ఆమె పేరు మాలిని. మాలిని చాలా అందగత్తె మాత్రమే గాక, అంతులేని ఆస్తికి వారసురాలు కూడా కావటం చేత ఆమెను పెళ్ళాడటానికి అనేకమంది యువకులు విశ్వ ప్రయత్నాలు చేశారు. కాని వారి ప్రయత్నాలేవీ ఫలించలేదు. ఎందుకంటే శూరవర్మ తన కుమార్తెను మహావీరుడికి తప్ప ఇవ్వనని పట్టుబట్టాడు.

ఆ నగరంలోనే ఒక క్షత్రియ యువకుడుండే వాడు. మాలినిలాగే ఆ యువకుడు కూడా చాలా అందగాడు. అతని పేరు కీర్తిసింహుడు. అతని తాతముత్తాతలు రాజ్యాలు ఏలినవాళ్ళే. కాని అతను పేదవాడు. అతనికున్న ఆస్తి అంతా కలిసి ఒక తెల్లగుఱ్ఱమూ, ఒక ఖడ్గమూనూ. అతనికి ఎవరూ లేరు. అందుచేత రాజుగారి సేనలోచేరి పొట్టపోసుకుంటున్నాడు.

ఒకనాడు కీర్తిసింహుడు చాలాదూరం ప్రయాణం చేసి వస్తూ నగరం వెలుపల ఉన్న శూరవర్మ భవనం చూసి తన గుఱ్ఱాన్ని ఆపాడు. ఎండలో రావటంచేత అతనికి దాహం జాస్తిగా ఉన్నది. ఆ భవనంలో తనకూ, తన గుఱ్ఱానికీ నీరు దొరుకుతుందేమోనని అతను ఆశపడి లోపలి ఆవరణలో ప్రవేశించాడు.

భవనం ముందర సుందరమైన చెట్లూ, పూలమొక్కలూ గల విశాలమైన ఉద్యానం ఉన్నది. చెట్ల మధ్య ఒక తామరకొలను వున్నది. ఆ కొలను గట్టు మీద మాలిని కూర్చుని ఉన్నది. ఆమె తలఎత్తి కీర్తిసింహుడికేసి చూసి, "ఎవరు మీరు? ఏం కావాలి?" అని అడిగింది.

ఆమె అందం చూసి కీర్తిసింహుడు ఒక్క క్షణం విస్మయం చెందాడు. నిజానికి అతని అందం చూసి మాలిని కూడా ఎంతో ఆశ్చర్య పడింది.

"చాలాదూరం నుంచి ఎండలోప్రయాణం చేసి వస్తున్నాను. నేనూ, నా గుఱ్ఱమూ బాగా

దప్పిగొని ఉన్నాం. మాకు నీరిప్పించ గలరా?'' అన్నాడు కీర్తిసింహుడు.

మాలిని చప్పట్లు చరిచింది. సేవకుడొకడు వచ్చాడు.

సేవకుడు వెళ్ళి, నీరు తెచ్చి కీర్తిసింహుడికి ఇచ్చి, గుర్రాన్ని అక్కడినుంచి తీసుకు పోయాడు.

దాహం తీరి ప్రాణం లేచివచ్చినట్టయి, కీర్తిసింహుడు చుట్టూ ఒకసారి కలయజూసి, ''ఎంత చక్కని వాతావరణం! ఇంత ఆహ్లాద కరమైన ప్రదేశంలో ఉండే మీరు విచారంగా ఉండటం విడ్డూరంగా ఉన్నది,'' అన్నాడు మాలినితో.

''నా విచారానికి కారణం ఉన్నది. నాకీ జన్మలో పెళ్ళి అయ్యేటట్టు లేదు. నన్ను మా నాన్న మహావీరుడికి కాని ఇవ్వడట! ఏ భీముడో,అర్జునుడో ఇంకా బతికి ఉంటే నాకు పెళ్ళి అవుతుంది. లేకపోతే కాదు!'' అన్నది మాలిని, తన మనసులోని బాధను వెళ్ళ గక్కుతూ.

''అంటే, నాబోటివాడికి అవకాశం ఉండ దన్నమాట. నేను సామాన్య సైనికుణ్ణి. మా వంశం గొప్పదే గాని, నాకున్న ఆస్తి ఈ గుర్రమూ, కత్తి మాత్రమే! నాకు పరాక్రమం ఉన్నది గాని, దాన్ని ఎవరిపైనా ఇంతవరకు చూపలేదు. ఆ అవకాశం వచ్చేసరికి నేను ఏ వయసులో ఉంటానో,ఏమో! ''అన్నాడు కీర్తి సింహుడు.

''నన్ను సుఖపెట్టడానికి నీ వంటివాడు చాలు, కాని మా నాన్నను తృప్తి పరచటానికి నీ వంటివాడు పనికిరాడు,'' అన్నది మాలిని విచారంగా



వాళ్ళు ఇలా మాట్లాడుతూండగానే సేవ కుడు గుర్రానికి నీరుపట్టి అక్కడికి తీసుకు వచ్చాడు.

''ఇక నువ్వు వెళ్ళిపోవటం మంచిది. నేను మొహం తెలియనివాళ్ళతో మాట్లాడుతున్నట్టు తెలిస్తే మానాన్నకు ఆగ్రహం వస్తుంది,''అన్నది మాలిని.

కీర్తిసింహుడు తన గుర్రాన్ని ఎక్కి ఇంటికి వచ్చేశాడు. కాని మాలినిని మరిచిపోవటం అతనికి సాధ్యం కాలేదు. ఆమెకు స్వేచ్ఛ ఉంటే తనను తప్పక పెళ్ళాడుతుంది. ఆ నమ్మకం అతని మనోవ్యాధిని మరింత ఎక్కువ చేసింది. అతను రోజూ ఒంటరిగా కొండలలో తిరగటానికి వెళ్ళి, ఆ విషయమే ఆలోచించాడు.

ఒకనాడు అతను కొండలలో తిరుగు తూండగా ఒక గుడిసే, దాని ముందు



కూర్చుని ఒక ముసలిదీ కనిపించింది. ఆమె అతన్ని చూస్తూనే, "ఏమిటి, బాబూ, నీ విచారం?" అన్నది.

తన మనసులో ఉన్న మాట ఆ ముసలి దానితో చెప్పుకోవాలనిపించింది కీర్తిసింహుడికి.

అతని కథ అంతా విని ఆమె, అతన్ని ఒక్క క్షణం ఆగమని, తన గుడిసెలోకి వెళ్ళి, ఒక డబ్బీ తెచ్చింది.

"ఈ డబ్బీలో ఒక చిన్న సాలీడుపురుగు ఉన్నది. దీన్ని నేల మీద పడేస్తే, నామంత్ర ప్రభావం వల్ల, ఒక మహాసర్పంగా మారి పోతుంది. దాన్ని నువ్వు చంపావంటే గొప్ప వీరుడివని ఖ్యాతి తెచ్చుకుంటావు. దీని సహాయంతో నీ కోరిక నెరవేరుతుందేమో చూడు," అంటూ ఆ డబ్బీని కీర్తిసింహుడికి ఇచ్చింది.

మర్నాడు కీర్తిసింహుడు ఆ డబ్బీని తన దుస్తులలో దాచుకుని శూరవర్మ ఇంటికి వెళ్ళాడు. శూరవర్మ అతన్ని లోపలికి రానిచ్చి, "ఏం పని మీద వచ్చావు?" అని అడిగాడు.

"నేను గొప్ప వంశానికి చెందిన సుక్షత్రియుణ్ణి. మా తాతముత్తాతలు రాజ్యాలు ఏలారు. విధి వక్రించి నేను సాధారణ సైనికుడిగా ఉంటున్నాను. పేదవాణ్ణి కూడానూ. నాకు మీ కుమార్తెను పెళ్ళాడాలని కోరిక కలిగింది. ఆ మాట మీతో మనవి చేయటానికి వచ్చాను," అన్నాడు కీర్తిసింహుడు.

శూరవర్మ అతన్ని ఎగాదిగా చూసి, "నీ శౌర్యపరాక్రమాల మాట చెప్పు. మిగిలిన విషయాలతో నాకు పనిలేదు," అన్నాడు గంభీరంగా.

"నేను కొత్తగా చేరిన సైనికుణ్ణి. ఒకటి, రెండు దొమ్మీలలో పాల్గొన్నాను గాని, పెద్ద యుద్ధాలలో ఇంకా పాల్గొన లేదు. కాని అవకాశం దొరికితే ఎంత శౌర్యమైనా చూపగలను," అన్నాడు కీర్తిసింహుడు.

"ఏమైనా సాహసకృత్యాలు చేసి నాకు కనబడు. ఇప్పటికి నువ్వు వెళ్ళవచ్చు," అన్నాడు శూరవర్మ.

కీర్తిసింహుడు తల వంచుకుని వచ్చేస్తూ, ఒక కిటికీ పక్కగా వచ్చి తన డబ్బీ తెరిచి, అందులోని సాలీడును కింద పడేశాడు.

మరుక్షణమే బయటి నుంచి పెద్ద కలవరమూ, హాహాకారాలూ వినవచ్చాయి. అందరూ పరిగెత్తుకుంటూ బయటికి వెళ్ళారు. శూరవర్మ కూడా వెళ్ళాడు.

బయట ఒక మహాసర్పం బుసలు కొడుతూ, బీభత్సం చేస్తున్నది.

"చూస్తారేమిత్రా? దాన్ని చంపండి!" అని శూరవర్మ కేకలు పెట్టాడు. కాని ఎవరూ

కదలలేదు. ఆ సర్పానికి వీలయినంత దూరంగా అందరూ పారిపోయారు.

''దాన్ని చంపటం ఎవరితరం, బాబూ? అది మామూలు పామా? మహాసర్పం!'' అన్నారు వాళ్ళు.

''ఉండండి.దాని సంగతి నేనుచూస్తాను,'' అని శూరవర్మతో అని, కీర్తిసింహుడు కత్తి దూసి, మహాసర్పాన్ని సమీపించాడు. అది అతన్ని తోకతో విసురుగా కొట్టటానికి ప్రయత్నించింది. కీర్తిసింహుడు పక్కకు దూకి, దాని తోకను తన కత్తితో నరక యత్నించాడు. కాని పాము కత్తివేటును నేర్పుగా తప్పించుకున్నది.

ఆ మహాసర్పానికీ, కీర్తిసింహుడికీ చాలాసేపు తీవ్రమైన ఘర్షణ జరిగింది. ఆ సర్పం తనను తోకతో కొట్టటానికీ, శరీరంతో చుట్టటానికీ, నోటితో పట్టటానికీ చేసిన ప్రయత్నాలన్నిటి నుంచీ కీర్తిసింహుడు లాఘవంతో తప్పించుకున్నాడు. అతని కత్తిదెబ్బలను పాము కూడా చాలాసేపు తప్పించుకున్నది. కాని చివరకు కీర్తిసింహుడు సర్పం తోక నరకగలిగాడు. ఆ తరవాత ఆ సర్పాన్ని బలహీనపరిచి, దాని తలను తన కత్తితో చితకపొడవటం సాధ్యమయింది.

ఈ భయంకరమైన యుద్ధాన్ని చూస్తూన్న వారందరికీ ముచ్చెమటలు పోశాయి. శూరవర్మ ముఖాన ఆనందం తాండవించింది. ఆయన కీర్తిసింహుణ్ణి సమీపించి, భుజం తట్టి, ''బేష్!బేష్! నువ్వు నిజంగా వీరాగ్రేసరుడివి,''అని తన సేవకుల కేసి తిరిగి, ''ఇతన్ని తీసుకుపోయి చక్కగా తలస్నానం చేయించి, కొత్త బట్టలు కట్టబెట్టండి. పోయి పురోహితుణ్ణి పిలుచుకురండి!''అనిఆజ్ఞలుజారీచేశాడు.

తరవాత కీర్తిసింహుడికీ, మాలినికీ వైభవంగా వివాహం జరిగింది.

తరవాత కొన్ని రోజులకు కీర్తిసింహుడు ఒక సంచీ, ఒక చిన్న డబ్బీ తీసుకుని, కొండలలో కాపరం ఉన్న ముసలిదాని వద్దకు వెళ్ళి,''ఇది నా బహుమానం! ఇది నీ డబ్బీ!'' అన్నాడు.

ముసలిది సంచీ విప్పి అందులో ఉన్న బంగారం చూసుకున్నది; డబ్బీ మూత తీసి అందులో వున్న సాలీడు పురుగును చూసుకున్నది; ''వెయ్యేళ్ళు వర్థిల్లు నాయనా!'' అని కీర్తిసింహుణ్ణి మనసార ఆశీర్వదించింది.



# స్వర్గమా? నరకమా?

రామాలయంలో హరికథా కాలక్షేపం జరుగుతున్నది. హరిదాసు కథ చెబుతూ, మధ్యలో పాపపుణ్యాల, స్వర్గ నరకాల ప్రసక్తి తీసుకొచ్చాడు.

''మోక్ష సాధనను అందరూ తమ లక్ష్యంగా వుంచుకోవాలి. ఇహ జీవితంలో పుణ్యకార్యాలు చేస్తూ,కేవలం తామరాకు మీద నీటిబొట్టులా గృహస్థ జీవితం సాగించేవారికి, తప్పక స్వర్గలోక ప్రాప్తి వుంటుంది. అయితే, అది అంత సులభసాధ్యంకాదు. ముందు కోరికలను చంపుకోవాలి. దృష్టిని భగవంతుడిపై సారించాలి. అలా పుణ్యం సంపాదించి స్వర్గానికిపోయి భగవంతుని సాన్నిధ్యం పొంద గోరేవారంతా, ఒకసారి చేతులెత్తండి!'' అని హరిదాసు ఆగాడు.

ఆయన ముందున్న ఒక ముదుసలిరైతు తప్ప అందరూ చేతులెత్తారు. హరిదాసు అతణ్ణి పట్టి పట్టి చూశాడు. అయినా, ఆ ముసలాయనలో చలనంలేదు.

అప్పుడు హరిదాసు కాస్త కటువుగా, ''కోరికలకు బానిస అవటం చాలా తేలిక. ఐహిక సుఖా లలో మునిగి తేలుతూ, భగవన్నామస్మరణ లేనివారికి మరణం తర్వాత నరకం తప్పదు. అక్కడ యమభటులు అలాంటి వాళ్ళను చిత్రహింసలకు గురిచేస్తారు. అలాంటి ఘోరమైన నరకానికి పోవడానికి ఎవరైనా సిద్ధంగా వున్నారా? ఉండరని తెలుసు! అయినా అలాంటి వారెవరైనావుంటే చేతులెత్తండి!'' అన్నాడు, ముసలివానికేసి చూస్తూ.

అక్కడ వున్నవారిలో ఎవరూ చేయిఎత్తలేదు. ముసలిరైతూ చేయిఎత్తలేదు. హరిదాసు అతడి కేసి గుడ్లురిమి చూస్తూ, ''అయ్యా! తమరెక్కడికి పోదలచుకున్నారు? స్వర్గానికి వెళ్తారా అంటే చేయెత్తలేదు; పోనీ నరకానికి అంటేనూ చేయెత్తలేదు,'' అన్నాడు.

ముసలి రైతు ఒకసారి పెద్దగా దగ్గి, ''స్వామీ, నాకు ఇప్పుడప్పుడే ఎక్కడికీ పోవాలని లేదు. నా మునిమనమరాలికి ఇప్పుడిప్పుడే మాటలు వస్తున్నాయి. అవి చిన్న చిలక పలుకులంటే నమ్మండి. మా ఎల్లావు ఇప్పుడు చూడిది - రానున్న అయిదో ఈతలో తప్పక కోడెదూడెను పెడుతుందని, మా పశువైద్యుడు కూర్మాచారి అంటున్నాడు!'' అన్నాడు.

—రామవరపుగణేశ్వరరావు



# వార్తలు  విశేషాలు

## నేలకు ఒరిగిన 'మిర్'

అంతరిక్షంలో పరిశోధనలు జరపడానికి వీలుగా 1986 ఫిబ్రవరి 26వ తేదీ ప్రయోగించబడిన సోవియట్ అంతరిక్ష కేంద్రం 'మిర్' పదిహేను సంవత్సరాల తరవాత గత మార్చ్ 3వ తేదీ నిప్పులు చిమ్ముతూ నేలకు ఒరిగింది.

ఈ అంతరిక్ష కేంద్రం తొలుత మూడు సంవత్సరాలకు మాత్రమే ఉద్దేశించబడింది. అయినా అది పదిహేనేళ్ళపాటు సేవలందించింది. దానిలో ఎన్నో పరిశోధనలు జరిగాయి. 104 మంది వ్యోమగాములు అందులో వుండి 16,500 పరిశోధనలు జరిపారు. ఈఅంతరిక్షకేంద్రం86,300 సార్లు భూకక్ష్యలో పరిభ్రమించింది.

సోవియట్ యూనియన్ ప్రయోగించిన 'మిర్' నిర్వహణా బాధ్యతలు 1991లో సోవియట్ యూనియన్ విచ్ఛిన్నమయ్యాక రష్యా చేపట్టింది.దాంతో యేటా 250 మిలియన్ డాలర్ల వ్యయం రష్యాకు తలకు మించిన భారమయింది. ఆ కారణంగా అమెరికాతో చేతులు కలిపింది.అమెరికా వ్యోమగాములు కూడా అందులో అనేక పరిశోధనలు జరిపారు. ఆ విధంగా 'మిర్' ఉభయ దేశాల అంతరిక్ష మైత్రీవేదికగా తయారయింది. అమెరికా వ్యోమగాములు అంతరిక్ష కేంద్రాన్ని రూపొందించే



సాంకేతిక పరిజ్ఞానాన్ని గ్రహించి అమెరికా అంతర్జాతీయ అంతరిక్ష కేంద్రాన్ని ఏర్పాటు చేయడానికి సాయపడ్డారు. అది ఇప్పటికే భూకక్ష్యలో ప్రవేశించింది.

భూమి మీద 'గ్రౌండ్ కంట్రోల్ ఆపరేషన్' పకడ్బందీగా పనిచేయడంతో దాని ఆదేశం ప్రకారం 140 టన్నుల 'మిర్' భూవాతావరణంలో ప్రవేశించగానే దాదాపు 1,500 ముక్కలయింది. అవి అగ్నిగోళాల్లా మారి నిప్పులు చిమ్ముతూ పసిఫిక్ సముద్రంలో పడిపోయాయి. రష్యన్ ఇంజనీర్లు తమ సాటిలేని సాంకేతిక పరిజ్ఞానాన్నీ, నైపుణ్యాన్నీ మరొకసారి ప్రపంచానికి చాటిచెప్పిన తరుణం అది!

## 'మిర్' మరికొన్ని....

☛ పదిహేనేళ్ళకాలం పనిచేసిన మిర్‌లో వ్యోమగాములు పన్నెండున్నర సంవత్సరాలు గడిపారు. వ్యోమగామి వాలెరీ పోలియాకోవ్ వరసగా 437 రోజులు అందులో గడిపాడు. వ్యోమగామిని షణ్నన్ లూసిడ్ అందులో 188 రోజులు గడిపి అంతరిక్ష కేంద్రంలో ఎక్కువ రోజులు గడిపిన మహిళగా పేరు తెచ్చుకున్నది.

☛ అంతరిక్ష కేంద్రం భూవాతావరణంలో ప్రవేశించగానే ముక్కచెక్కలై మండిపోయిందికదా? అలా మండిపోయిన వాటిలో బైబిల్, ఖురాన్ మొదలైన 100 పుస్తకాలూ, మొదట అంత రిక్షంలో అడుగుపెట్టిన యూరీ గగారిన్ ఫోటో, 11 టన్నుల విజ్ఞాన పరిక రాలూ ఉన్నాయి.

☛ మిర్ విచ్ఛిన్నం కావడానికి రెండు రోజులు ఉన్నప్పుడు కూడా- ఇంకా ఉపయోగంలోవుంది గనక, దానిని భూకక్ష్యలో మరికొంత కాలం కొనసాగించాలని- రష్యన్ పార్లమెంటు సభ్యులు ప్రెసిడెంట్‌వ్లాడిమీర్‌పుతిన్‌కు విజ్ఞప్తి చేశారు. ఆ సభ్యులలో ఇద్దరు వ్యోమగాములు కూడా ఉన్నారు.

## భూమిపై నుంచి అంగారక గ్రహ ఛాయాచిత్రాలు

భారతదేశానికి చెందిన షలీన్ హరియాల్కా (15), తన్మయ్ హినాద్కర్(13) వికాస్ సారంగధర (10) అనే విద్యార్థులు, ప్రపంచ దేశాల నుంచి మరో ఆరుగురు విద్యార్థులతో కలిసి మాలిన్‌లో ఉన్న 'మార్స్ గ్లోబల్ స్పేస్ క్రాఫ్ట్' నుంచి అంగారక గ్రహాన్ని ఫోటోలు తీశారు. అందులో ఇసుక దిబ్బలు, లోయలతోపాటు నీటి పొరలు ఉన్నాయని నిరూపించడానికి ఆధారాలు చూపే కొన్ని అద్భుత ఛాయాచిత్రాలు ఉన్నాయి!

# 50–ఏళ్ళుగా అలరిస్తూన్న 5–ఏళ్ళ వయసు చిలిపి పాత్ర

ప్రపంచ వ్యాప్తంగా చాలా పత్రికలలో చోటు చేసుకుని పాఠకులను అలరిస్తూన్న అందమైన కామిక్ క్యారక్టర్ 'డెనిస్ ది మెనేస్!'. హెన్రీ 'హ్యాంక్ కెట్చెమ్' అనే చిత్ర కారుడు దీనిని సృష్టించాడు. దీని సృష్టికి కారణం ఎవ రనుకున్నారు? సాక్షాత్తు ఆ చిత్రకారుడి కుమారుడు 'డెన్నిస్'. వాడికి నాలుగేళ్ళు



ఉన్నప్పుడు వాడి తల్లి, భర్త దగ్గరికి వచ్చి నీ బిడ్డ మరీ చిలిపిగా తయారయ్యాడు అన్నది. ఆ మాటతో స్ఫూర్తి పొంది, 1951లో కెట్చెమ్ ఐదేళ్ళ వయసు చిలిపిపాత్ర డెన్నిస్ ది మెనేస్‌తో పాటు తల్లిదండ్రులు మిట్చెల్స్, ఇరుగుపొరుగు విల్సన్స్, పాల్స్‌జోయీలను కల్పించాడు. ఈ పాత్రలు గతయాభై సంవత్సరాలుగా పిల్లలతో పాటు పెద్దలను కూడా అల రిస్తున్నాయి.

## భూకంపం – శిక్షణ

భూకంపం వచ్చినప్పుడు భవనాల నుంచి బయటపడడం ఎలాగా అని గుజరాత్‌లోని బడిపిల్లలకు శిక్షణ నిస్తున్నారు. ఆ శిక్షణలో మొదట ఒక హెచ్చరిక గంట వినిపిస్తుంది. ఇది మామూలు బడిగంటలా కాకుండా భిన్నంగా ఉంటుంది. గంట వినిపించగానే భయకంపితులు కాకూడదు. ఒక పద్ధతిలో వేగంగా ఒకరి వెనక ఒకరుగా వెలుపలి ప్రదేశానికి వెళ్ళాలి. చివరి విద్యార్థికి తరవాత తరగతిలోని ఉపాధ్యాయుడు బయటకురావాలి. స్కూలు ప్రిన్సిపాల్ ఆఖరుగా వెలుపలికి రావాలి. ఇలాంటి శిక్షణ ఇచ్చిన తరవాత అహ్మదాబాదులో ఒక బడిలోని వెయ్యిమందికి పైబడిన విద్యార్థులు ఒక్క నిమిషంలో గదుల నుంచి వెలుపలికి చేరుకో గలిగారు!

## నూరు కోట్లు దాటింది!

నిరుటి మే 1వ తేదీ పుట్టిన బిడ్డతో మన దేశ జనాభా నూరు కోట్లు దాటింది. దేశ జనాభా లెక్కల సేకరణ తొలిదశ ఫిబ్రవరి 28 అర్ధ రాత్రికి ముగిసింది. ఒక నెల తరవాత వెలువడిన కొన్ని ప్రాథమిక వివరాలు ఈ పది నెలలలో 2,70,15,247 జనాభా పెరిగినట్టు తెలియ జేస్తున్నాయి. మార్చ్ 1 కి మన దేశంలో పురుషుల సంఖ్య 53,12,77,078; స్త్రీలు 49,57,38,169మంది. వంద కోట్లకు పైబడిన జనాభా గల దేశాలలో మనదేశం రెండవ స్థానంలో ఉన్నది. చైనాది మొదటి స్థానం!

అక్షరాస్యత విషయానికి వస్తే ఆరేళ్ళకు పైబడినవాళ్ళల్లో 65.83 శాతం మంది అక్షరాస్యులు. పురుషులలో 75.85 శాతం మందీ, స్త్రీలలో 54.16 శాతం మందీ అక్షరాస్యులు. కేరళ రాష్ట్రానిది ప్రథమ స్థానం (90.92); మిజోరం (88.49) రెండవ స్థానంలో ఉంది. 87.52 శాతం అక్షరాస్యతతో లక్ష ద్వీపాలు మూడో స్థానంలో ఉంది.

ఫిబ్రవరి 9-28 తేదీల మధ్యదాదాపు, 17,00,000 మంది సిబ్బంది 5,200 పట్టణాలు, 6,40,100 గ్రామాలలోని 20 కోట్లఇళ్ళకు వెళ్ళి ప్రజల వివరాలు సేకరించారు. మనదేశంలో 1871లో ప్రప్రథమంగా జనాభా లెక్కల సేకరణ జరిగింది. 2001లో ఇప్పుడు జరిగింది 14వ జనాభా లెక్కల సేకరణ.

# మోతాదు మించిన చికిత్స!

కాశీయాత్రలో ఇద్దరు వైద్యులు కాకతాళీయంగా కలుసుకున్నారు. వారి కబుర్లు అటు తిరిగి ఇటు తిరిగి వారి వృత్తి విషయాల్లోకి మళ్ళింది. "వ్యాధులన్నిటిలోకీ, మానసికవ్యాధిని కుదుర్చటం చాలా కష్టం," అని మొదటి వైద్యుడు తన అనుభవం గురించి ఇలా చెప్పాడు:

"మా దేశంలో ఒక వింత ఆచారముంది. మగ సంతానం లేకుండా రాజు మరణిస్తే, పట్టపుటేనుగుకు ఒక పూలమాల ఇచ్చి, దాన్ని అలా స్వేచ్ఛగా వదులుతాం. ఆ మాలను అది ఎవరి మెడలో వేస్తుందో వాడే మారాజు అవుతాడు. మా రాజుకు కొడుకులు లేరు. మా నగర శివార్లలో, ఒక కట్టెలు కొట్టేవాడున్నాడు. వాడు రాజు త్వరలోనే పోతాడనీ, పట్టపుటేనుగు తననే రాజుగా చేస్తుందనీ భ్రమలోపడ్డాడు. అది కాస్త పిచ్చిగా ముదిరి,వాడు తను అప్పుడే రాజయినట్టే ప్రవర్తించసాగాడు. వాడి పిచ్చిని నయం చేయమని, వాడి తల్లిదండ్రులు నాకప్పగించారు. నేను ఐదేళ్ళపాటు చికిత్సలు చేసి, అతి కష్టం మీద వాడి పిచ్చి కుదిర్చాను," అన్నాడు.

"అంటే, వాడు తన భ్రమలనుంచి, బయటపడి, కట్టెలు కొట్టేవాడినని గ్రహించాడన్న మాట, అవునా?"అని అడిగాడు రెండో వైద్యుడు.

"ఔను! ఆ సమయంలో రాజుగారు మరణించడమూ, పట్టపుటేనుగు కాస్తా వాడి మెడలో పూలమాల వేయడమూ జరిగాయి!" అన్నాడు మొదటి వైద్యుడు.

"అద్భుతం!" అంటూ చిటికెలు వేశాడు రెండో వైద్యుడు.

"వినండి! ఇక్కడే ఒక మహాద్భుతం జరిగింది. వాడు ఏనుగు తన మెడలో వేసిన పూలదండను విసిరి దూరంగా పారేసి, 'నేను మీ రాజును కాను!' అంటూ కాలి సత్తువ కొద్దీ పారిపోయాడు. ఆ తర్వాత వాణ్ణి అడవిలో కట్టెలు కొడుతూండగా కొందరు చూసి, పిచ్చివెధవ అనుకుంటూ నవ్వుకున్నారు. ఇది వాడి కర్మ అనుకోవాలి..." అంటూ ఆగి, రెండో వైద్యుడి కేసి గుచ్చి చూశాడు.

"బుద్ధి కర్మానుసారిణీ అన్న ఆర్యోక్తి నిజమే! కాని ఇందులో మీ పొరబాటేమైనా వున్నదేమో వితర్కించారా?" అని అడిగాడు రెండో వైద్యుడు వినయంగా.

"వితర్కించడమే కాదు, ఇన్నాళ్ళు గడిచినా, పొరబాటెక్కడ జరిగిందని ఇంకా ఆలోచిస్తూనే వున్నాను!" అన్నాడు మొదటి వైద్యుడు. "క్షమించాలి! మీరు మోతాదు మించిన చికిత్స చేసినట్టుంది!" అన్నాడు రెండోవైద్యుడు.

- "సత్య"





వ్యాఖ్యలు రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ





ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని వ్యాఖ్యలు రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వతేదీలోగా మాకు అందేలా పంపాలి.పోటీ ఫలితాలు ఆగస్ట్2001 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ. 100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82,డిఫెన్స్ఆఫీసర్స్‌కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ - 600 097.

## అభినందనలు

ఏప్రిల్ 2001 సంచికలో బహుమతి పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
శ్రీ బి.వి.ఆర్.ఎస్.ఎస్.ప్రసాద్
అలహాబాద్ బ్యాంక్, వెస్టర్న్ జోనల్ ఆఫీస్,
216,మనీష్ కామ్ సెంటర్,డా.ఎ.బి.రోడ్,వోర్లీ
ముంబాయి - 400 025

బహుమతి పొందిన వ్యాఖ్యలు



మొదటి ఫోటో: పగటివేషం నా వృత్తి!
రెండవ ఫోటో: పదును పెడితేనే భుక్తి!!

**CHANDAMAMA** (Telugu) **JUNE 2001** Registrar of Newspapers, India RN1114/57